# జె. కృష్ణమూర్తి



# శ్రీలంక సంభాషణ

1980



సోల్ డిస్ట్రిబ్యూటర్స్:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాదు - 500 001.

# జె. కృష్ణమూర్తి



# శ్రీలంక సంభాషణలు
# 1980




సోల్ డిస్ట్రిబ్యూటర్స్:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాదు - 500 001.

**Sri Lanka Sambhashanalu - 1980**
Telugu Translation of Sri Lanka Talks, 1980
Translation into Telugu by C. Hanumantha Rao.

ప్రతులు : 1000

తొలి ముద్రణ : కృష్ణమూర్తి ఫౌండేషన్ ఇండియా, నవంబరు, 1990

ద్వితీయ ముద్రణ : జనవరి, 1999



వెల: రూ. 15-00



ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

శ్రీ కళాంజలి గ్రాఫిక్స్ హైదరాబాద్ - 29. ఫోన్: 3229831

# ప్రస్తావన

జె. కృష్ణమూర్తి (1895–1986) విశ్వవిఖ్యాత తత్త్వవేత్త. అరవయి సంవత్సరాలు పైబడి ప్రపంచంలో పలుదేశాలు పర్యటించి, జనసమూహాలకు జీవన సందేశాన్ని అందజేశారు. “ ‘సత్యం’ అనేది రహదారి లేని క్షేత్రము. సంస్థలద్వారా, నమ్మకాల ద్వారా, క్రతువుల ద్వారా, గురువుల ద్వారా దాని చెంతకు చేరలేము. ఆధ్యాత్మ బోధనల వల్ల, మానసిక వికాస ప్రక్రియల ద్వారా దానిని అందుకోలేము. పరస్పర సంబంధమను దర్పణం సహాయంతో, మన మనసులోని సరంజామాను అర్థం చేసుకోవడం ద్వారా, పరిశీలన వల్ల మాత్రమే ఈ పని సాధ్యం అవుతుంది”– అని వక్కాణించారు.

తాను బోధకుడిని – గురువును కానని, పదిమందితోపాటు విషయచర్చ చేస్తూ స్వస్వరూప జ్ఞానం ద్వారా సత్యాన్ని తెలుసుకోవాలని అన్నారు. తాను చెబుతూ వున్న విషయాలను సాధికారంగా తీసుకుని వల్లె వేయవద్దనీ, వాటిని జాగ్రత్తగా పరిశీలించి, ఎవరికి వారు నిగ్గుతేల్చుకోవాలనీ పదేపదే చెప్పారు.

కృష్ణమూర్తి ఉపన్యాసాలు, రచనలు అన్నీ ఇంగ్లీషులోనే సాగాయి. ఇంగ్లీషు రాని వారి కోసం ఇతర భారత భాషలలోనికి కొన్ని ప్రసంగాలు, పుస్తకాలు యిప్పటికే అనువాదం చేయబడినాయి. ఇతర భాషలలోనికి జరిగే అనువాద కార్యక్రమాలను స్వయంగా చేపట్టాలని, కృష్ణమూర్తి భావప్రసారాలను వీలయినంత వరకు సజావుగా, సరళంగా అందరికీ అందచేయాలని కృష్ణమూర్తి ఫౌండేషన్ ఇండియా సంకల్పించింది. ఈ ప్రయత్నంలో భాగంగా ఈ సంవత్సరం కొన్ని మౌలిక గ్రంథాలను తెలుగులో ప్రచురించటానికి యేర్పాట్లు జరుగుతున్నాయి.

ఈ పుస్తకాల సహాయంతో కృష్ణమూర్తి ఆశించిన నవ మానవ ఆవిర్భావం, నవ సమాజ అవతరణ గురించి చదువరులు యథాతథంగా తెలుసుకోవటానికి వీలవుతుందని ఆశిస్తున్నాం. కృష్ణమూర్తి తత్త్వ దర్శనాన్ని తరచి తరచి చూచుకుని, అవగాహన చేసుకోవటానికి, ఆచరణలోనికి తీసుకు రావటానికి ఈ పుస్తకాలు దోహదం చేస్తాయి. పాఠకులు వీటిని ఆదరిస్తారని నమ్ముతున్నాము.

ఎ. గజానన రావు
సమన్వయకర్త
దక్షిణ భాషల అనువాద విభాగం
కృష్ణమూర్తి ఫౌండేషన్, ఇండియా

వసంతవిహార్,
గ్రీన్ వేస్ రోడ్డు,
మదరాసు – 600 028.
20 నవంబర్, 1990.

# విషయసూచిక

# 1. జీవితమనగా పరస్పరసంబంధము, కర్మాచరణము
## (Life is Relationship and Action)

మన దైనిక జీవిత సమస్యను గూర్చి ఇద్దరు మిత్రులు మాట్లాడుకొంటున్నట్లుగా మనం కలిసి మాట్లాడుకొందాం. ఆ విషయాన్ని చాల జాగ్రత్తగా, ముందు వెనుకలు చూచుకొంటూ, వివేకంతో చర్చించాలంటే మొట్టమొదట ఈ ప్రపంచంలో మన చుట్టూరా – అంటే, ఈ శ్రీలంకలోనే కాదు, ఐరోపాలో, అమెరికాలో, చైనాలో, రష్యాలో, భారతదేశంలో – వాస్తవంగా ఏమి జరుగుతున్నదో గమనించవలసి వుంటుంది. ప్రపంచమంతటా, ఎక్కడ చూచినా అలజడి, అల్లకల్లోలము, అవ్యవస్థ కనిపిస్తాయి. సంఘమంతా భ్రష్టమై అవినీతితో నిండియున్నది; అన్యాయము మితిమీరింది; దరిద్రము తాండవిస్తున్నది. అన్ని జాతులు యుద్ధానికి సిద్ధమౌతున్నాయి. మతంపేరిట, ఆర్థిక నీతిపేరిట, ఏజాతి కాజాతి తాము నాశనం కాకుండ తప్పించుకోవడం కోసము ఒకరినొకరు చంపుకోడానికి సిద్ధ మౌతున్నారు! తమతమ భద్రతలకోసమై తాము ఒకరినొకరు చంపుకోడానికి తయారవుతున్నారు! ఈ దేశంలో మత విభేదాలున్నాయి – హీనయానమని, మహాయానమని. భారతదేశంలో లెక్కలేనంతమంది దేవతలు, లెక్కలేనన్ని శాఖాభేదములున్ను. క్రైస్తవమతంలో కూడ ఎన్నో విభేదాలున్నాయి – క్యాథలిక్కులని, ప్రొటెస్టంట్లని, యింకా యెన్నో రకరకాల తెగలున్నాయి. ప్రపంచమంతటా జాతిభేదములు, మతభేదములు, ఆర్థిక (స్థితిలో) భేదములు పెక్కులు. ద్రవ్యోల్బణము, అధిక జనాభా, దారిద్ర్యములాంటి సమస్యలు పెక్కులు. సాంకేతిక విజ్ఞానముతో జతగూడిన జాతీయతాభావము మనిషిని సర్వనాశనము చేయబోతున్నది. ఇవి యథార్థవిషయాలు; అంతేగాని, యీ వక్తయొక్క స్వాభిప్రాయాలు కాదు, ఆయన యొక్క ఉద్దేశాలు కాదు.

కాబట్టి, బాహ్యంగా చూస్తే మానవుని పరిస్థితి యేమిటి? మానవుడంటే భావనాప్రపంచంలో ఊహించుకోబడిన వ్యక్తిగా కాదు. మానవుడంటే మీరు, నేను, మరి యితరుడు – మన స్థితి యేమిటి? మానవునికిన్ని సమాజమునకును మధ్యగల సంబంధమును అర్థం చేసికోవడం చాల అవసరమనుకొంటాను. ఇప్పుడున్న మన సంఘము భ్రష్టమై, ఎంతో అన్యాయముతో నిండివున్నది. మన పరిపాలకులు మనలను సరిగా పరిపాలించడం లేదు. మనిషిచే నిర్మింపబడినది యీ సంఘము. అంటే – మీ చేతను నాచేతను మన తాతముత్తాతల చేతను నిర్మింపబడినది యీ సంఘము.

# విషయసూచిక

# 1. జీవితమనగా పరస్పరసంబంధము, కర్మాచరణము
# (Life is Relationship and Action)

మన దైనిక జీవిత సమస్యను గూర్చి ఇద్దరు మిత్రులు మాట్లాడుకొంటున్నట్లుగా మనం కలిసి మాట్లాడుకొందాం. ఆ విషయాన్ని చాల జాగ్రత్తగా, ముందు వెనుకలు చూచుకొంటూ, వివేకంతో చర్చించాలంటే మొట్టమొదట ఈ ప్రపంచంలో మన చుట్టూరా – అంటే, ఈ శ్రీలంకలోనే కాదు, ఐరోపాలో, అమెరికాలో, చైనాలో, రష్యాలో, భారతదేశంలో – వాస్తవంగా ఏమి జరుగుతున్నదో గమనించవలసి వుంటుంది. ప్రపంచమంతటా, ఎక్కడ చూచినా అలజడి, అల్లకల్లోలము, అవ్యవస్థ కనిపిస్తాయి. సంఘమంతా భ్రష్టమై అవినీతితో నిండియున్నది; అన్యాయము మితిమీరింది; దరిద్రము తాండవిస్తున్నది. అన్ని జాతులు యుద్ధానికి సిద్ధమౌతున్నాయి. మతంపేరిట, ఆర్థిక నీతిపేరిట, ఏజాతి కాజాతి తాము నాశనం కాకుండ తప్పించుకోవడం కోసము ఒకరినొకరు చంపుకోడానికి సిద్ధ మౌతున్నారు! తమతమ భద్రతలకోసమై తాము ఒకరినొకరు చంపుకోడానికి తయారవుతున్నారు! ఈ దేశంలో మత విభేదాలున్నాయి – హీనయానమని, మహాయానమని. భారతదేశంలో లెక్కలేనంతమంది దేవతలు, లెక్కలేనన్ని శాఖాభేదములున్ను. క్రైస్తవమతంలో కూడ ఎన్నో విభేదాలున్నాయి – క్యాథలిక్కులని, ప్రొటెస్టంట్లని, యింకా యెన్నో రకరకాల తెగలున్నాయి. ప్రపంచమంతటా జాతిభేదములు, మతభేదములు, ఆర్థిక (స్థితిలో) భేదములు పెక్కులు. ద్రవ్యోల్బణము, అధిక జనాభా, దారిద్ర్యములాంటి సమస్యలు పెక్కులు. సాంకేతిక విజ్ఞానముతో జతగూడిన జాతీయతాభావము మనిషిని సర్వనాశనము చేయబోతున్నది. ఇవి యథార్థవిషయాలు; అంతేగాని, యీ వక్తయొక్క స్వాభిప్రాయాలు కాదు, ఆయన యొక్క ఉద్దేశాలు కాదు.

కాబట్టి, బాహ్యంగా చూస్తే మానవుని పరిస్థితి యేమిటి? మానవుడంటే భావనాప్రపంచంలో ఊహించుకోబడిన వ్యక్తిగా కాదు. మానవుడంటే మీరు, నేను, మరి యితరుడు – మన స్థితి యేమిటి? మానవునికిన్ని సమాజమునకును మధ్యగల సంబంధమును అర్థం చేసికోవడం చాల అవసరమనుకొంటాను. ఇప్పుడున్న మన సంఘము భ్రష్టమై, ఎంతో అన్యాయముతో నిండివున్నది. మన పరిపాలకులు మనలను సరిగా పరిపాలించడం లేదు. మనిషిచే నిర్మింపబడినది యీ సంఘము. అంటే – మీ చేతను నాచేతను మన తాతముత్తాతల చేతను నిర్మింపబడినది యీ సంఘము.

మానవ నిర్మితమైన యీ సంఘమును సంపూర్ణంగా సమూలంగా మార్చివేయ వీలున్నది. సంఘంలో మార్పు రావాలని మానవుడు సర్వదా కలలు కంటూనే వుండినాడు. పురాతనకాలము నుండి యీనాటివరకు అట్టి మార్పు తేవడం గురించి మాట్లాడినవారు, సంఘమెట్లా వుండవలెనో తెల్పుతూ ఎన్నో గ్రంథాలు వ్రాసినవారు పెక్కు వేదాంతులున్నారు. దీనికోసం పాశ్చాత్యదేశాలలో ఎన్నో విప్లవాలు జరిగినాయి; ఉదాహరణకు ఫ్రెంచి విప్లవము, రష్యాలో కమ్యూనిష్టు విప్లవము మున్నగునవి. అట్టి విప్లవం ద్వారా పర్యావరణంలో, సామాజిక వాతావరణంలో మార్పులు తేవాలని ప్రపంచమెంతో తహతహలాడింది. దానికోసం ప్రయత్నించి పనిచేసింది. సామ్యవాదులు, సమాజవాదులు, ఇంకా యితర వామపక్షీయులు దానికోసం ప్రయత్నిస్తున్నారు. కాని, యీ భౌతిక విప్లవము పెద్ద మార్పు నేమియు తీసికొని రాలేదు. ఇవన్నీ యథార్థ విషయాలు. వాండ్లకందరికి ఇప్పుడొక గురుపీఠ మేర్పడినది, నూతన ధనికవర్గ మేర్పడినది, నూతనమైన ప్రబల ప్రజాపీడకవర్గ మేర్పడినది. సంఘవ్యవస్థలో పైపైన ఏదో కొంత మార్పు వచ్చినా అసలు మూలములో మార్పు లేదు; లక్షలాది సంవత్సరాలుగా ఎట్లున్నదో ఇప్పుడును అట్లే ఉన్నది.

ఇవన్నీ జాగ్రత్తగా గమనిస్తూ మనమెందుకిట్లా జీవిస్తున్నామో, మానవులెందుకింత అధోగతి పాలయినారో పరీక్షిద్దాం, పరిశోధిద్దాం. మనమిప్పుడు సిద్ధాంతాలగురించి, నమ్మకాలగురించి, మతంలోని పిడివాదాల గురించి మాట్లాడడం లేదు. అందరం కలిసి మొదట మనం నివసించే సమాజాన్ని పరిశీలించి చూచి, దానికోసం మనమేమి చేయవలెనో ఆలోచిద్దాం. ఈ వక్త దానిగురించే మాట్లాడుతున్నాడు. అంటే – మీకు సంబంధించినదే మాట్లాడుతున్నాడుగాని వేరొక దానిగురించి మాట్లాడడం లేదు. అతడు మానవమాత్రుని గురించి, అంటే – మీ గురించి, మాట్లాడుతున్నాడు. ఈ భూమిపై యుగాలతరబడి నివసించిన మానవుడు, ఎంతో అనుభవముతో పరిణతి చెందిన మానవుడు, ఎంతో విజ్ఞానమును – సాంకేతిక విజ్ఞానమును, మనస్తత్త్వ విజ్ఞానమును గూడ ఆర్జించిన మానవుడు నేడిట్టి అధ్వాన్నస్థితికి, ఇట్టి దుర్గతికి, ఇట్టి అస్తవ్యస్త పరిస్థితికి ఎందుకు దిగజారిపోయినాడో ఆ విషయమై యీ వక్త మాట్లాడుతున్నాడు. తెలిసిందా? ఏదో సిద్ధాంతం గురించిగాని, ఏదైనా ప్రచారం కోసంగాని మాట్లాడడం లేదు. మీ గురించి, మానవజాతికి ప్రతీకగా నున్న మీ గురించి మాత్రమే మనం కలిసి మాట్లాడుకొంటున్నాం. మానవజాతి బాధపడుతున్నది; ప్రపంచంలో మానవు డెక్కడున్నాసరే బాధపడుతున్నాడు, ఎంతో ఆందోళన, తీరని సంశయము, అనిశ్చిత పరిస్థితి, ఎడతెగని శ్రమ, ప్రయాసలతో తన అంతరంగంలోను, బహిరంగంగాను గూడ బాధపడుతున్నాడు. మీకు మాదిరే అతనికిని పెద్దపెద్ద భయాలున్నాయి; మనస్సు క్రుంగిపోతుంటుంది; అన్నిటను అనిశ్చిత పరిస్థితి, సంశయము. కాబట్టి, మనకును మానవజాతికిని భేదము లేదు; మీకును మానవజాతికిని భేదము లేదు; మీరే మానవజాతి. ఈ మాటను మీరు దయచేసి శ్రద్ధగా వినాలి.

వినడమనేది ఒక గొప్ప కళ – మీకు తెలుసునా? ఒకరు చెప్పేదానిని పూర్తిగా వినడమనేది గొప్ప కళలలో నొకటి. దానిని మనము పెంపొందించుకోలేదు.

ఆ విధంగా ఒకరు చెప్పే దానిని మీరు పూర్తిగా వింటూ వుంటే, మిమ్ము మీరు వింటూవున్నట్లే. అంటే – మీ సొంతసమస్యలను, మీ అనుమానాలను, అనిశ్చయాలను; మీ దుఃఖాన్ని, దుర్దశను; మీ కంగారును, కలవరపాటును, భద్రతకోసం ప్రాకులాడడాన్ని – అన్నిటిని మీరు వింటూ వుంటారు. మానవులందరి గురించి – అంటే, మీగురించే – మనం కలిసి మాట్లాడుకొంటున్నాం. అందువలన మానసికంగా మీరే ప్రపంచము, ప్రపంచమే మీరు. మీ జుట్టు నల్లగా నుండవచ్చు. మీ ముఖములు గోధుమరంగులో వుండవచ్చు. మరికొందరు పొడుగ్గా, తెల్లగా, నీలిరంగు కన్నులతో నుండవచ్చు. కాని, మానవులన్న తరువాత, వారెక్కడనున్నాసరే, ఎట్టి శీతోష్ణస్థితిలో నున్నాసరే, ఎట్టి పరిస్థితులలో నున్నాసరే, మీమాదిరే వారున్ను యీ క్లేశాన్ని అనుభవిస్తుంటారు, జీవితంలోని యీ గోలను, గడబిడలను చవి చూస్తుంటారు. కాని, గడ్డి పరకనుగాని, పూవు పూయడాన్నిగాని ఎన్నటికిని చూడనే చూడరు. కాబట్టి, ప్రపంచమంటే మీరు, నేను, ఇతరులున్ను. ఇది కల్పిత సిద్ధాంతము కాదు. గ్రుడ్డిగా నమ్మవలసిన విషయం కాదు. మీరే ప్రపంచము, ప్రపంచమే మీరనేది ఒక యథార్థ విషయము, ఒక తథ్యము. మీ రీవిషయం వింటున్నారని తలుస్తాను. అటువంటి వాక్యాన్ని వింటే విచిత్రంగా తోచవచ్చు; తర్కసంగతముగాని, వాస్తవముగాని కాదని అనిపించవచ్చు. అందువలన మీరు దానిని కొంత మట్టుకు విని, యింక ఇది మానివేసి ఇతర విషయాలను గురించి మాట్లాడితే బాగుండునని తలుస్తారు. అంతేగాని, దేనిలోని సత్యాన్నైనా నిజంగా మీరు వినిపించుకోరు. దయచేసి యీ వక్త చెప్పే విషయంతోబాటు మిమ్ముమీరు వినిపించుకోండి; అంటే, మీ మనస్సులో, మీ హృదయంలో, మీ ప్రతిస్పందనలలో, మీ సమాధానాలలో ఏమి జరుగుతున్నదో వినండి. దానితోబాటు పక్షులను వినండి, కారు పోవడాన్ని వినండి. ఇట్లా వింటూవుంటే మీ మనస్సులు కోమలములు, జీవంతములు, క్రియాశీలములున్ను అవుతాయి.

మన మెదడు ఎన్నో లక్షలకొలది సంవత్సరాల ఫలితము. ఈనాటికది – అంటే ఆ మానవ మస్తిష్కము – భయంతోను, ఆందోళనతోను, జాత్యహంకారముతోను, భాషాపరిమితులతోను నిండి నిబద్ధమై పోయినది. తక్కిన మానవజాతితో అభేదముగా నున్న మీరు మానవమాత్రులుగా సమూల పరివర్తనము పొందవలెనంటే దానికి తగిన నూతన సమాజమును ప్రపంచములో ఎట్లు నిర్మింపగలమనేది ఇప్పుడున్న ప్రశ్న. ఇదే అసలిప్పుడు చర్చనీయాంశము; యుద్ధము నెట్లు నివారింపగల మనేది కాదు. మానవుని మనస్సును, అంటే, మీ మనస్సును – మీ హృదయమును – మీ పరిస్థితిని – పూర్తిగా మార్చివేయడం సాధ్యమా? అనేది ప్రధానమైన చర్చనీయాంశము; లేకపోతే మనము మన జాత్యహంకారము, మన భాషాభేదములు, మన జాతీయతాభావములు కారణంగా ఒకరినొకరము నాశనం చేసికొంటాము. వీటిని రాజకీయ నాయకులు తమ తమ స్వప్రయోజనము నిమిత్తమై నిలబెట్టే ఉంచుతారు. ఇప్పుడు నేను చెప్పదలచిన విషయాన్ని బాగా స్పష్టం చేయగలిగానని అనుకుంటాను. అంటే – సర్వమానవ జాతితో అభిన్నముగా నున్న మీరు మానవ మాత్రులుగా సమూల పరివర్తనము పొందగలరా? మీకు ప్రశ్న అర్థమైనదా? "పరివర్తనము

పొందడమంటే అర్థమేమిటి? ఈ స్థితినుండి మరియింక ఏ స్థితిలోనికి మారడ" మని మీరడుగవచ్చు. తప్పకుండా మీరడగవలసిన ప్రశ్నే అది. ఆ ప్రశ్నను మీరడిగితే దాని అర్థం రాబోయేస్థితి ఎట్లుండేదిన్నీ ముందుగానే మీరు ఊహిస్తున్నారన్న మాట. ఇది చాల ముఖ్యమైన విషయము. ఇది బుద్ధిబలముతో చేసెడి మాటల మార్పిడికాదు, సిద్ధాంతముల వినిమయము కాదు. యథార్థ విషయాలతో మనము వ్యవహరిస్తున్నాము. యథార్థవిషయమంటే – ప్రపంచములోనూ మీలోనూ యథార్థంగా ఏమి జరుగుతున్నదో అది. సరేనా?

పాశ్చాత్య దేశాలలో రకరకాలయిన జనసముదాయము లున్నాయి. బహుశా ప్రాచ్యదేశాలలోను గూడ. వారనేదేమంటే – మనిషి మౌలికంగా యెన్నటికినీ మారడని. "లక్షలకొలది సంవత్సరాలుగా మనిషి ఈ విధంగానే జీవించినాడు. అతని స్థితిని మార్చడం అసాధ్యం. అతనిని కొద్దిగా దిద్దవచ్చు, అతనిలో కొంత మార్పు తేవచ్చు, కాని, మానవుని పరిస్థితి పూర్తిగా యెన్నటికినీ మార్చలే"మని అంటారు. మరికొందరనే దేమంటే – పరిసరాలలో మార్పుతెస్తే, సంఘవ్యవస్థను మార్చివేస్తే, అప్పుడు మనిషి తప్పనిసరిగా మారతాడని. సామ్యవాదులు చేస్తున్నపని అదే. ఆర్థికవ్యవస్థను, సాంఘికవ్యవస్థను – ఇంకా ఇట్టి బాహ్యారూపాలను మారిస్తే అప్పుడు ఆ నూతన పరిస్థితులలో నివసించే మానవుడు కూడ మారతాడని వారి యుద్దేశము. మరి కొందరనే దేమంటే – వారికి భగవంతునిలో నమ్మకమున్నదని, ఎంతగట్టి నమ్మకముంటే అంతబాగా మన సమస్యలన్నీ తీరతాయని అంటారు. ఈ పద్ధతులన్నీ మళ్ళీ మళ్ళీ అనేక పర్యాయములు, అనేక రూపాలతో, అనేక నామాలతో ఆచరణలో పెట్టబడ్డాయి. కాని, మనిషి మాత్రం యుగాలు గడిచినా అవినీతిపరుడుగానే వుండిపోయినాడు. అతనిలో దాదాపు మార్పే లేదు. అంటే – బాధపడడం, ఆందోళన చెందడం, ఒంటరితనము, అనిశ్చిత పరిస్థితి, భద్రతలేమి – ఇట్లా ఇవన్నీ కొనసాగుతూనే వున్నాయి. ఈ వాస్తవికాలను వాస్తవికాలుగా గుర్తించినప్పుడు, దాని కెవరైనా ఏమిచేయాలి అనే ప్రశ్న ఉదయిస్తుంది.

ఈ వక్త మీముందు పెడుతున్న అద్దంలోకి – మీరే ఆ అద్దం – దానిలోకి మనం జతగా కూడి చూస్తున్నామా? మనిషి యొక్క ప్రవర్తన, అతడనుభవించెడి మితిమీరిన క్లేశములు, అతని దైనిక జీవితము, ఇతరులతో అతనికి గల సంబంధము – ఇటువంటి వానిని గూర్చి మనం మాట్లాడుకొంటున్నాం. ఇదంతా చాలా స్పష్టంగా లోతుగా అర్థమైతేనే తప్ప ధ్యానమనే దానికి అర్థమే లేదు. మన యిల్లు సక్రమంగా లేదంటే దాని అర్థం మీరు సక్రమంగా లేరని. మీరెంతసేపటికీ జెన్ పద్ధతిలోనో, టిబెటనుల పద్ధతిలోనో, బుద్ధుడు చెప్పినరీతిగానో, హిందువులు చేసెడి రీతిగానో, లేదా ఇటీవల ఎవరో గురువు క్రొత్తగా కనిపెట్టిన విధానముననో ధ్యానం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ ధ్యానము మతి భ్రమలకు దారి తీస్తున్నది. అది కాదు అసలు కావలసిన విషయము. అసలు కావలసిన విషయమేమంటే – దానికి సరియైన పునాది వేయడం. అనగా, మన జీవితంలోనికి క్రమబద్ధత రావడం. మనమిప్పుడు అస్తవ్యస్తమైన జీవితాన్ని నడుపుతున్నాము. ఒకదానికొకటి పొందికలేని జీవితాన్ని నడుపుతున్నాం. మనం చెప్పేది ఒకటి, చేసేది ఇంకొకటి. మనం ఒకదాన్ని

నమ్ముతాం, దానికి విరుద్ధంగా నడుచుకొంటాం. మీరు క్రైస్తవులైనా, బౌద్ధులైనా, లేక మరింకేమతానికి చెందివున్నా మీరొక దేవుణ్ణి – ఆ దేవుడెవరన్నాగాని – నమ్ముతారు. ఆ నమ్మికకు మీ దైనిక జీవితంలో ఆదారం లేదు. అది వాస్తవికత మీద ఆధారపడిలేదు. ఆ నమ్మకాలకు, మతమందలి పిడివాదాలకు, నీతులకు, సూక్తులకు, ఆజ్ఞలకు, అనుమతులకు మన దైనిక జీవితంలో వాస్తవికత లేదు. అందువలన వాటినన్నింటిని ప్రక్కకు త్రోసివేయండి. మీ మతవాదములను, విశ్వాసములను, అభిప్రాయములను, ఊహా ప్రతిమలను అన్నింటిని ప్రక్కకు త్రోసివేయండి. జీవితాన్ని ఉన్నదున్నట్లు ఎదుర్కొనండి. అంతేగాని, చిత్రవిచిత్రంగా కల్పించుకొన్న ఊహాప్రతిమల ద్వారా తప్పించుకో జూడకండి.

బహుశా మీలో కొందరు దీనికంతకును ఆక్షేపణ తెల్పవచ్చు. అలాగా మీరు ఆక్షేపిస్తే నాకు చాల సంతోషం. దాని అర్థం, కనీసం మనం తోడుగా ఆలోచిస్తున్నట్లు. కేవలం ఆక్షేపించి ఊరుకోవద్దు. నిజం కనుక్కోండి. మనిషి నశించకుండా బ్రతకాలంటే మొండిగా ప్రశ్నించడం చాల అవసరం. ఈ వక్తనే కాదు ప్రశ్నించవలసింది – మీ నమ్మకాలను, మీ జీవితవిధానాన్ని, ఈ విధంగా ఎందు కాలోచిస్తున్నారో, ఈ విధంగా ఎందుకు జీవిస్తున్నారో ప్రశ్నించండి. పట్టు విడవకుండా మొండిగా ప్రశ్నించడం – అంటే, ప్రతిదానిని శంకించడం – చాల ముఖ్యం. మీరే గనుక శంకిస్తే ఆ శంకతో మీకెంతో శక్తి వస్తుంది. అప్పుడు మానవుడు – అంటే, మీరు – మతగురువులు, విశ్లేషకులు, మనోవిజ్ఞాన శాస్త్రవేత్తలు, ఇంకా ఇతరులు మీ మీద మోపిన భారములను తీసి దూరంగా త్రోసి వేయడానికి అరంభిస్తారు. మానసికంగా కనీసం కొంతవరకైనా స్వేచ్ఛ ననుభవింపసాగుతారు.

వేలకొలది సంవత్సరాలనుండి పరిణామము చెందుతూ వచ్చిన మానవుని మనస్సును మన మిప్పుడు పరీక్షిస్తున్నాము. ఇప్పుడు మనమొక స్థితికి చేరినాము. ఈ స్థితిలో బుద్ధి హీనమగు జాతీయతాభావములను పట్టుకొని ఒకరినొకరం నాశనం చేసికొంటామా, లేక మతగురువుల అభిప్రాయముల భారమును తొలగించుకొని స్వతంత్ర మానవులముగా పునర్జన్మ నొంది బ్రదికి బయట పడతామా? మత గురువుగాని, వైజ్ఞానికుడుగాని, రాజకీయ నాయకుడుగాని, ఆర్థికశాస్త్రవేత్తగాని, పరిసరములను దూషితము కాకుండా కాపాడవలె ననేవాడుగాని, ఎవడున్ను మనలను కాపాడలేడు. మానవజాతిని కాపాడగల్గునది మీరు, మీకు మీరు పరివర్తనము పొందడం. కాబట్టి యీ విషయంలోకి మెల్లగా పోయి విచారిద్దాం.

మొదట తెలిసికోవలసిన విషయం, జీవించడమంటే, పరస్పర సంబంధములో పయనించడమని. పరస్పర సంబంధం లేకుండా మీరు జీవించలేరు. అసలు జీవితమంటేనే ఒకరితో నొకరికి గల సంబంధము, దానితోబాటు కర్మల నాచరించ డమున్ను. పరస్పరసంబంధమంటే మన యుద్దేశమేమి? పరస్పర సంబంధము చాల ముఖ్యము, అది లేకుండా మానవుడు జీవించలేడు: మానవుడెల్లప్పుడు ఏదో యొకదానితో సంబంధము కలిగియుంటాడు. మరియొక మానవునితో సంబంధం కలిగియుంటాడు, లేదా ఒక అభిప్రాయము, ఒక భావన, ఒక ఊహాప్రతిమతో సంబంధము కల్గియుంటాడు. అదేదైనా సరే, అది మీకును మరియొకనికిని మధ్యగల

సంబంధము. సరే, మీకితరులతో గల సంబంధ మెటువంటిది? ఇది యొక సమస్య. ఏలయన, మన కితరులతోగల సంబంధమే – అది యెట్టిదన్నాగాని – మనము జీవించు సమాజమునకు మూలము, అదియే యీ సమాజమును నిర్మించినది. మీరు లోభులు, అసూయాపరులు, హింసాత్మకులైనచో అటువంటి హింసాసూయాపరమగు సమాజమునే మీరు నిర్మిస్తారు. మొట్టమొదటినుండి మీరీ విషయమై స్పష్టముగానుంటూ పరస్పర సంబంధమననేమో కనుగొనవలసియున్నది. మరి యొకరితో సంబంధమంటే యేమిటి? అది భార్యతోగాని, భర్తతోగాని, ఇరుగుపొరుగు వారితోగాని, ప్రభుత్వంతో గాని, మరి దేనితోనైనా సరే మీకు గల సంబంధము దేనిమీద ఆధారపడి వుంటుంది? పరస్పర సంబంధము లేనిదే మనిషికి అస్తిత్వము లేదు.

జీవితమంటే పరస్పర సంబంధము, కర్మాచరణమున్ను. ఇవి రెండును మానవునికి మూలాధారములు, ప్రధానములు. ఇతరులతో మనకు గల సంబంధ మెటువంటిది? మీ భార్యలతో మీకుగల సంబంధ మెటువంటిది? లేదా మీ భార్యలకు మీతో గల సంబంధ మెటువంటిది? లేదా బౌద్ధమత గురువుతో, హిందూమత గురువుతో, క్రైస్తవమత గురువుతో మీకుగల సంబంధ మెట్టిది? దీనిని మీరు చాల దగ్గరగా వుండి పరిశీలిస్తే, మీకు వారితో గల సంబంధమంతా మీరు వారిని గురించి మనస్సులో కల్పించుకొన్న ఊహాప్రతిమల మీద, అంటే – దేవుని గురించి, బుద్ధుని గురించి, మీ భార్యలను గురించి లేదా మీ భార్యలు మీ గురించి యేర్పరచుకొన్న ఊహాప్రతిమల మీద – ఆధారపడి వుండడం గమనించ గలరు. ఇది యథార్థము, కాదా? భర్త తన భార్యను గురించి, భార్య తన భర్తను గురించి ఊహాప్రతిమలను ఏర్పరచుకొంటారు. అందువలన భార్యాభర్తల సంబంధమంటే ఆ రెండు విధములైన ఊహాప్రతిమల మధ్య గల సంబంధమే. ఈ ఊహాప్రతిమలు నిత్యసాహచర్యము, కామసుఖము, చిరచిర లాడడం, కోపము, ఊరట మొదలగువాని ద్వారా ఏర్పడతాయి. ప్రతివాడున్ను మరి యొకని గురించి తానొక ఊహాప్రతిమను ఏర్పరచుకొంటాడు; తన్నుగురించి కూడా తానొక ఊహాప్రతిమను కలిగి వుంటాడు. అట్లే దేవుని గురించి, తాను చేయవలసియున్న మత విధుల గురించి ఊహాప్రతిమ లుంటాయి. ఏదైనా ఊహాప్రతిమ నేర్పరచుకొన్నప్పుడు అది యెంత నిరాధారమైనదైనా, ఎంత అవాస్తవికమైనా, ఎంత పిచ్చిదైనా సరే, అందులో భద్రత కనిపిస్తుంది. అందులో భద్రతను మనస్సు కల్పించుకొంటుంది. మీ భార్యలను గురించి మీరుగాని, మీ గురించి మీ భార్యలుగాని ఊహాప్రతిమల నేర్పరచుకొన్నప్పుడు, అవి వాస్తవమైనవికావు. వాస్తవికాలతో జీవించడం చాల కష్టం. కాని, అవాస్తవికమైన ఊహాప్రతిమలతో జీవించడం చాల తేలిక. ఇంతకున్ను మీ సంబంధము రెండు ఊహాప్రతిమల మధ్యగల సంబంధమేకాన మీ మధ్య నిజంగా సంబంధము లేనట్లే. క్రైస్తవుడు ఒక ఊహాప్రతిమను పూజిస్తాడు. అది మతగురువు చేతను, పూజించు భక్తుని చేతను శతాబ్దాల తరబడి నిర్మింపబడినది. "నాకు భద్రత కావాలి, నన్ను కాపాడే మనిషి కావాలి. నేను చాల చిక్కులలో వున్నాను. నాకు దిక్కుతోచడం లేదు. నాకు భద్రత లేదు. ఈ ఊహాప్రతిమలోనే నాకు భద్రత కనిపిస్తూ వున్నది" అని ఆ భక్తుడు అంటాడు. ఈ విధంగా మనం ఊహాప్రతిమలను

ఆరాధిస్తూ వుంటాము. సత్యమునుగాని, పవిత్ర జీవితమునుగాని ఆరాధించము. ప్రతిమలను మాత్రమే ఆరాధిస్తాము. జాతీయపతాకతోబాటు జాతిని గూర్చిన ఊహాప్రతిమను, వైజ్ఞానికుని గూర్చి, ప్రభుత్వమును గూర్చి ఇంకా మొదలైన వానిని గూర్చి మీరూహించుకొన్న ప్రతిమలను మీరు పూజిస్తుంటారు. ఊహా ప్రతిమలను ఏర్పరచుకొవడం మానవుని బలహీనతలలో నొకటి. అయితే, దేని గురించికూడా ఎట్టి ఊహాప్రతిమల నేర్పరచుకోకుండా కేవలం వాస్తవికాలతో జీవించడం, అంటే – వాస్తవంగా జీవితంలో ఏమేమి జరుగుతున్నవో వాటితో జీవించడం సాధ్యమా?

అసలు మనస్సు ఊహాప్రతిమల నేల నిర్మించు కొంటుంది? జీవితమంటే ఊహాప్రతిమలు కాదు. దురదృష్ట వశాత్తు జీవితమంటే పోరాటము, జీవితమంటే నిత్యఘర్షణ. ఘర్షణ అనేది ఊహాప్రతిమ కాదు, అది యొక వాస్తవికము. కాని, మనస్సు ఊహాప్రతిమల నేల నిర్మించుకొంటుంది? ఊహాప్రతిమ అంటే ఒక సంకేతము, ఒక అభిప్రాయము, ఒక నిర్ణయము, ఒక భావన. "నేను దీనిని కాను, దాని మాదిరి ఉండాలని నా కోరిక" – ఇదియొక ఊహాప్రతిమ. దీనిని మనస్సు తన భవిష్యత్తుకోసం ఊహించుకొన్నది. కాబట్టి, అది అవాస్తవికము. వాస్తవవిషయం ఏమంటే, ఇప్పటికిప్పుడు మీ మనస్సులో వాస్తవంగా ఏమి జరుగుతున్నదో అది. మన ప్రశ్న యేమంటే, "మనస్సు ఊహాప్రతిమల నేల నిర్మించుకొంటుంది?" అని. అందులో భద్రత వుండడం వల్లనా? అసలు మీ గురించి మీరు ఊహాప్రతిమను దేనినీ నిర్మించుకోలేదా? మేము చాల గొప్పవారమని, లేదా మేము చాల గొప్పవారము కామని, అట్లా ఏదేదో మీగురించి మీరు ఊహించుకోలేదా? ఊహా ప్రతిమలతో జీవించడమంటే భ్రాంతితో జీవించడం, వాస్తవికంతో జీవించడం కాదు. ఇంతకూ ఊహాప్రతిమలను నిర్మించే యంత్రపరికరమేది? వ్యవస్థీకరింపబడి సర్వసమ్మతమై ఆదరణీయములగు మతములన్నిటికిన్ని ఏదో యొక విధమైన ఊహాప్రతిమ ఉంటుంది. తన మతగురువు సహాయంతో మానవు డెల్లప్పుడున్నూ చిహ్నాన్ని, అంటే సంకేతాన్ని, భావనను, మనోగతమగు అభిప్రాయాన్ని ఆరాధిస్తూనే వచ్చినాడు. ఆ యారాధనలో అతనికి ఊరట లభిస్తుంది, భద్రత లభిస్తుంది, రక్షణ వుంటుంది. కాని, ఆ ప్రతిమ ఊహా కల్పితము, ఆలోచనచే నిర్మితము. దాని స్వభావము తెలిసికోవాలంటే ఆలోచనా ప్రక్రియను అర్థం చేసికోవాలి.

ఆలోచించడమంటే యేమిటి? ఊహాప్రతిమల నిర్మాణము మనిషికి గల అలవాట్లలో నొకటి. ముఖ్యంగా మత విషయములలో ఇది జరుగుతుంది. అతనికి తన్ను గురించి కూడ ఊహాప్రతిమ ఉంటుంది. ఇప్పుడు ప్రశ్న యేమంటే, మనస్సు – అంటే, మీ మనస్సు – ప్రతిమల నేల ఊహించుకొంటుంది? అని. అవాస్తవమైనప్పటికిన్ని అందులో భద్రత వుందనా? ఊహాప్రతిమలు వాస్తవములు కావు. అవి భ్రాంతులు, కల్పితములు. అయినను మనిషి వాటియందు భద్రత కోసం వెదకు కొనడం కనబడుతుంది. సర్వ మానవ సాధారణమైన ఊహాప్రతిమల నిర్మాణాన్ని అర్థం చేసికోవాలంటే ఆలోచన అన్నా, ఆలోచించడమన్నా యేమిటి? ఆలోచనల స్వభావమేమిటి? – యీ ప్రశ్నలకు సమాధానం కనుగొనాలి. ఆలోచనలు ప్రకృతిని సృష్టించలేదు. పులి, నది, అద్భుతమైన వృక్షజాతి, అడవులు,

కొండలు, వాటి నీడలు, భూమి యొక్క సౌందర్యము - ఇందులో దేనిని కూడా మానవుడు సృష్టించలేదు. కాని, మానవుడు తన ఆలోచన ద్వారా యుద్ధానికి కావలసిన విధ్వంసక సామగ్రిని సృష్టించినాడు. దానితోబాటు మందువైద్యము, శస్త్ర వైద్యము మొదలైన వాటిల్లో గొప్ప అభివృద్ధిని సాధించినాడు. ఎంతో మంచికి, ఎంతో చెడ్డకున్ను ఆలోచనయే కారణము. ఇది యొక వాస్తవము. అయితే, ఆలోచన ఈ సమస్యలను పరిష్కరించగలదా అనే విషయమై పరిశీలించి తెలిసికోవాలని మనిషి గట్టిగా కోరేటట్లయితే, అసలు ఆలోచనమంటే యేమిటో మనం ముందు తెలిసికోవలసి వుంటుంది.

అనుభవము ద్వారా సంపాదించిన జ్ఞానము స్మృతి రూపంలో మెదడులో నిలువ చేయబడి వుంటుంది. ఆ స్మృతి యొక్క ప్రతిస్పందనయే ఆలోచన. మానవజాతి తాననుభవించిన వేలకొలది అనుభవాల ద్వారా ఎంతో జ్ఞానమును సంపాదించుకొన్నది. అది యధార్థజ్ఞానము కావచ్చు, భ్రాంతి మూలకము కావచ్చు. ఆ జ్ఞానమే స్మృతి. అది మెదడులో నిలువచేయబడినది. మీరేదైనా ప్రశ్న వేసినప్పుడు ఆ స్మృతినుండి వచ్చెడి సమాధానమే ఆలోచన. ఇదియొక వాస్తవికము. ఈ విషయమును మీయంతట మీరే కనుగొనవచ్చును. అంటే, మీకొక అనుభవం కల్గినదనుకోండి. ఆ యనుభవాన్ని మీరు జ్ఞాపకముంచుకొన్నారు. అదియే జ్ఞానము. స్మృతిరూపములోనున్న ఆ జ్ఞానము నుండి ఆలోచన పుట్టుతుంది. ఇంతవరకు బాగా స్పష్టమైనదా? మీ మనస్సులోకి దృష్టి పోనిచ్చి స్వయంగా చూచుకోండి. మీకే గనుక అనుభవం లేకపోతే, దానివలన జ్ఞానమే లేకపోతే, మీరు ఆలోచించలేరు. కాబట్టి, అనుభవం ద్వారా వచ్చిన జ్ఞానము, స్మృతి, తనకెదురైన ప్రశ్నకు స్పందించుటయే ఆలోచన. ఆలోచన మీద ఆధారపడి మనం జీవిస్తాము. జ్ఞాన మెన్నటికిన్ని పరిమితమే; దేని గురించియైనా సంపూర్ణ జ్ఞానమంటూ లేదు. ఇదియొక వాస్తవిక విషయము. ఆలోచన యెప్పటికిన్ని పరిమితమే. క్రైస్తవుల భవ్యమైన దేవాలయము, అద్భుతమైన రాతివిగ్రహము, మహాకావ్యము, గొప్ప ఇతిహాసము - ఇవన్నీ ఆలోచనా ఫలితాలే. ఆలోచన ఎంతో అందమైనది కావచ్చును. కాని, జ్ఞానమెల్లప్పుడు అజ్ఞానపు నీడలో వుండడం చేత అది అసంపూర్ణము కాబట్టి, దానినుండి వచ్చెడి ఆలోచన గూడ అసంపూర్ణమే, పరిమితమే. అట్టి ఆలోచన ఈ ఊహాప్రతిమలను సృష్టించినది. అది మీకును మీ భార్యలకును మధ్య ఊహాప్రతిమలను సృష్టించినది. ఆలోచన సాంకేతిక విద్య (టెక్నాలజీ)తో బాటు జాతీయతా భావమును సృష్టించినది; అది ప్రపంచాన్ని నాశనం చేస్తున్నది.

ఇప్పుడు ప్రశ్న యేమంటే, ఊహాప్రతిమ ఒక్కటిగూడ లేకుండ మనము దైనిక జీవితమును గడుపలేమా? అని. ఇక్కడినుండి యింటికి పోవాలంటే మన ఆలోచన పని చేయాలి. మీ యిల్లు ఎక్కడ వున్నదో, ఏ దారిన పోవలెనో ఇటువంటి వానిని గురించిన జ్ఞానం మనకుండాలి. అట్టి జ్ఞానం తప్పనిసరి; అది లేనిచో మనం దారి తప్పుతాం. మాట్లాడడానికి భాషాజ్ఞాన మవసరం. ఈ వక్తకు మాట్లాడడానికి ఆంగ్లభాషా జ్ఞాన మవసరం. కాని, మనస్సులో ఊహాప్రతిమలను సృష్టించుకోవడం

అసలు అవసరమా? ఊహాప్రతిమ ఒక్కటిగూడా లేకుండా మనం జీవింపలేమా? అంటే, దాని అర్థం నమ్మకాలు, ఆదర్శాలు, అభిప్రాయాలు లేకుండా జీవింపలేమా? అవన్నీ మన ఆలోచనలలో నుండి పుట్టుకొని వచ్చినవే గదా! అంటే, అస్తవ్యస్తమైన జీవితం నడపడమని కాదు. కాబట్టి, అన్ని పరిస్థితులలోను సరియైనదనిపించుకొను కర్మాచరణమంటూ వున్నదా యనేది ఇప్పుడు ప్రశ్న. ఇంతకూ మనమందరం కలిసి ఒకేదారిన నడుస్తున్నామా లేక వక్తదారి వక్తదేనా?

అయ్యలారా, మన మనస్సులు రానురాను దిగజారిపోతూ వున్నాయి. యాంత్రికములుగా మారి ప్రవాహంలో కొట్టుకపోతూ వున్నాయి. ఉన్న యిల్లు గూడ కొట్టుకపోతూ వున్నది. మీకేదో ఉద్యోగం ఉండవచ్చు, ఇల్లు ఉండవచ్చు, అన్నిరకాల వస్తువులూ ఉండవచ్చు. కాని, అంతరికంగా మీరు దారి తప్పినారు, తికమకపడుతున్నారు, ఏదీ స్పష్టంగా లేదు. దేనిని నమ్మాలో మీకు తెలియడంలేదు. అందుకోసం ఆలోచన యొక్క ప్రాధాన్యాన్ని తప్పక అర్థం చేసికోవాలి. మనం ఆలోచనమీద ఆధారపడి జీవితం గడుపుతున్నాము. మనమేది చేసినా ఆలోచనమీద ఆధారపడినదే. అయితే ఆలోచన పరిమితమైనది కాబట్టి, మన జీవితం గూడ పరిమితమైనదే, అసంపూర్ణమే; అది నిండు జీవితం కాదు. నిండుదనాన్ని కొంతైనా చవిచూపగల దేనితోనైనా మన జీవితాలను సఫలం చేసికొందామని ప్రయత్నిస్తున్నాము. ఈ విధంగా మన జీవితమొక ఎడతెగని పోరాటము. మన లోపలను, మన బయటను గల యీ పోరాటాన్ని తుదముట్టించండి. అది మిమ్ములను మీరు అర్థం చేసికొన్నప్పుడే అంతమవుతుంది. అయితే, ఆ అర్థం చేసికోవడం ఎవరో మతగురువు చెప్పిన దాని ప్రకారంగాని, ఎవరో మనస్తత్త్వవేత్తయో, ఎవరో పండితుడో చెప్పినదాని ప్రకారం గాని కాదు; అద్దంలో మిమ్ము మీరు చూచుకొన్నప్పుడే అది అర్థమవుతుంది. మీకితరులతో గల సంబంధమే ఆ యద్దము. ఆ యద్దంలో చూచుకోవడమే మీ గురించి మీరు తెలిసికోవడం. మీరెవరు? ఎందుకట్లున్నారు? ఈ విషయా లెందుకు ఆలోచిస్తున్నారు? ఈ విధంగా ఎందుకు ప్రవర్తిస్తున్నారు? ఇవన్నీ తెలిసికొంటారు. ఆ యద్దంలో మీరు మీకు గల సంబంధాలనన్నింటిని, సమాధానాలనన్నింటిని చూచుకొనగలరు.

మానవజాతి యొక్క చరిత్ర, దానియొక్క కథ అంతా మీరే – అంటే, మీలో ప్రతియొక్కరున్ను. మీరే ఆ పుస్తకము. ఏ మార్గదర్శకుడుగాని, గురువుగాని, మతగురువుగాని, వేదాంతిగాని అవసరం లేకుండా మీయంతట మీరు చదువుకోగల పుస్తకమది. దానిని చదివితే మీ గురించి మీరు పూర్తిగా తెలిసికోగలరు. దానిని చాల జాగ్రత్తగా చదువకపోతే, అందలి సూక్ష్మాతి సూక్ష్మ విశేషములను, జరిగెడి కార్యకలాపమును వినకపోతే మీరా పుస్తకమును చదువలేరు. ఎడతెగని పోరాటంలో, ఎల్లప్పుడు బాధపడుతూ, విడువని భయముతో వుండిపోతారు. అందువలన తెలివి, శ్రద్ధగల మనిషికి తన జీవితగ్రంథాన్ని చదువుకోడం వలన ఎంతో లాభిస్తుంది. ఆ జీవితకథ ఊహాప్రతిమ కాదు, అది దానిలో నొకభాగము. దానిని మీరు చూడాలి, అంటే – దాని అర్థం మీ ఆలోచనలను, మీ ప్రతిక్రియలను, మీ అనిశ్చిత

పరిస్థితులను, మీ అసుఖాన్ని శ్రద్ధగా వినాలి; విని తెలిసికోవాలి. అందులోనే మీకు సమాధానం దొరుకుతుంది. అయితే, శ్రద్ధగా వినడమనే కళను మీరు నేర్చుకోవాలి. అంటే, మీరు చదివిన దానిని, మీరు చూచిన దానిని వ్యాఖ్యానించవద్దు, పెడర్థాలు తీయవద్దు, దానిలో మార్పులు తేవద్దు. కేవలం గమనించి చూడండి, అంతే.

ఎన్నడైనా మేఘాలను జాగ్రత్తగా గమనించినారా? గమనించే వుంటారు. ఈ దేశంలో అకాశం నిండా మేఘాలే. మీరెన్నడైనా వాటిని గమనించి చూచినారా? అవిగో చూడండి - ఎంత అందంగా, ఎంత మహత్తరంగా వున్నాయో! వాటిలో అపూర్వ కాంతి సౌందర్యములున్నాయి. మీరెప్పుడు దేనిని చూచినా దానికేదో పేరు పెట్టుతారు. పేరు పెట్టడంతో గమనించి చూడడం ఆగిపోతుంది. మన మనస్సులు పదములకు బానిసలై పోయినాయి. పదములంటే కొలవడం. కొలవడం లేకుండా గమనించినపుడే వస్తువులను ఉన్నవి యున్నట్లు - యథాతథంగా - చూడగలరు. కాబట్టి, మిమ్ము మీరు గమనించి చూచుకోండి. ఆ చూడడంలో వక్రవ్యాఖ్యానాలు జేయకుండా, ఏదో ఒకమార్గమును చేపట్టకుండా, ఏదేని ప్రయోజనమును మనస్సులో పెట్టుకోకుండా, ఉన్నదున్నట్లు చూచుకోండి. ఈ చెప్పినదంతా విని, అదెట్లా చేయాలి? అని ప్రశ్న వేస్తారు. ఎట్లా అనే ప్రశ్నను మీరు వేసేటట్లయితే, ఆ ప్రశ్నను ఎందుకు వేసినట్లు? నేను చెప్పేది మీకు అర్థమౌతున్నదా? నేనొక విషయం చెప్పినాను, ఏమని? జాగ్రత్తగా ఏదో ఒక మార్గమును అనుసరించిపోకుండా, ఏదేని ప్రయోజనమును మనస్సులో పెట్టుకోకుండా, మిమ్ము మీరు గమనించి చూచుకొంటూ వుంటే, మిమ్ము మీరు వినిపించుకొంటూ వుంటే మానవజాతి చరిత్రను, అంటే - మిమ్ము మీరు చదువుకోవడం ఆరంభిస్తారు. అంటే, మీగురించి మీకు తెలుస్తుంది. అదే నిజమైన విద్య. కేవలం డిగ్రీలు సంపాదించడం, ఏవేవో యితర విషయాల గురించిన జ్ఞానమును సంపాదించడమున్ను నిజమైన విద్యకాదు. నిజమైన విద్య యేదంటే - మానవజాతి పుస్తకంలో - అంటే, మీలో - మీ జీవితకథను చదవడం. ఆ పుస్తకాన్ని చదవడం కోసం మీరు మీలోని ప్రతియొక్క ప్రతిక్రియను ఒకదాని నొకటి తరుముకొని వస్తూ వేగముగా మారిపోతూవున్న ప్రతియొక్క ఆలోచనను గమనించి చూస్తూ వుండాలి. కేవలం గమనించి చూస్తూ వుండవలెనే గాని, దానిని మీరు మీ స్వాధీనంలో వుంచుకోవలెనని గాని దానిపై ఆధిపత్యము నెరపుదామని గాని, దానిని ప్రక్కకు త్రోసివేద్దామని గాని ప్రయత్నించరాదు. అయితే, అట్లా చేయడం చాల కష్టమని మీరంటారు.

ఇది యెట్లా చేయాలి? అని మీరడిగితే ఆ ప్రశ్నలోని ఉద్దేశమేమిటి? పుస్తకమెట్లా చదువవలెనో మీరు తెలిసికొనగోరుతారు. ఒక పసిపిల్లవాడు వర్ణమాలను నేర్చుకోవాలి కాబట్టి, వాటిని ఎట్లా చదువవలెనో తెలిసికొనగోరుతాడు. అందుకోసం వాడు - అ, ఆ, ఇ, ఈ లను మెల్లగా జాగ్రత్తగా చదవడం ప్రారంభిస్తాడు. కాని యిక్కడ, ఎట్లు అనే ప్రశ్నకే అవకాశం లేదు. కేవలం గమనించి చూడాలి, అంతే. ఎట్లా? అని మీరడిగినారంటే దాని అర్థం ఒక పద్ధతి, ఒక విధానాన్ని అడుగుతున్నారన్నమాట. ఆ తర్వాత, మిమ్ములను మీరు అర్థం చేసికోవడం కోసం, ఆ పద్ధతిని, ఆ విధానాన్ని అభ్యాసం చేయడం మొదలు పెట్టుతారు. మీరు అభ్యాసం చేస్తున్నప్పుడు, అది

యాంత్రికమైపోతున్నది. మీరు జీవముతో నున్నవారు. సజీవమైన పదార్థమును ఒక పద్ధతి, ఒక విధానము ద్వారా అర్థము చేసికోలేము. మీరు దానిని గమనించి చూస్తూ వుండాలి. దానితోబాటు మీరు కదలాలి, అర్థం చేసికోవాలి. అది చాలా మందికి ఎంతో కష్టమైన పని. అందువలన "దానిని త్వరగా ఎట్లా చేయవలెనో చెప్పు"మని అడుగుతారు. దీనికంతకు శీఘ్రమార్గమంటూ లేదు. మిమ్ము, మీ అభిప్రాయాలను, ఉద్దేశాలను ఓరిమితో గమనించి చూడడమొక్కటే మార్గము. అది మీలోని భాగమే. మీ అభిప్రాయాలను, మీరు గమనించి చూడండి. దీనికి ఎంతో ఓరిమి, ఎంతో అవధానత కావాలి. అందుకు మీలో తగినంత అభిరుచి వుండాలి, శ్రద్ధ వుండాలి.

*కొలంబో,*
*8-11-1980.*

★ ★ ★

# 2. జీవితపుస్తకము

## (The Book of Life)

ఆదిమకాలమునుండి నేటిదాక గల మానవుని జీవితచరిత్రమంతా మీలోనే ఉన్నది. అంతులేని అతని అనుభవాలు, నాటుకొనిపోయిన భయాలు, ఆందోళనలు, సుఖదుఃఖాలు వేలకొలది సంవత్సరాలనుండి పేరుకొని పోయిన రకరకాలైన నమ్మకాలు – అన్నీ – అందులో గలవు. 'మీరే' ఆ జీవితపుస్తకము. దానిని ఏ ప్రచురణకర్తయూ ప్రచురించలేదు. అది కొందామంటే దొరికేదికాదు. దానికొరకై మానసిక తత్త్వవేత్తలవద్దకు పోయి ఉపయోగము లేదు. ఎందుకంటే, అతని పుస్తకమున్ను మీ పుస్తకమున్ను ఒకటే – భేదము లేదు. మీరాపుస్తకాన్ని జాగ్రత్తగా, ఓరిమితో, నిదానముగా, వెనుకాముందూ చూచుకొంటూ చదువనిదే, అవినీతితో నిండి, కుళ్ళిపోయిన యీ మన మానవ సమాజాన్ని ఏమాత్రమున్ను మార్చలేరు. ఈ మన సమాజములో దారిద్ర్యము, అవినీతి, అధర్మము, అన్యాయము తాండవిస్తున్నాయి.

లోతుగా ఆలోచింపగల యే వ్యక్తియైనా గందరగోళము, దుర్నీతి, మానవ జాతియెడ ఘోరాపచారమగు యుద్ధము – వీటన్నింటితో నిండివున్న యీ ప్రస్తుత ప్రపంచంతో పట్టించుకోకుండా వుండగలడా? ఈ మన మానవ సమాజములోను, దాని నిర్మాణములోను సమూలపరివర్తనము తేవలెనంటే, ఈ పుస్తకమును – అంటే మిమ్మే – మీరు చదువగల్గియుండవలెను. మనమున్న యీ సమాజ మిట్లు పరిణమించుటకు మనము, మన తల్లిదండ్రులు, తాతముత్తాతలు – ప్రతియొక్కరున్ను – కారణమే. మానవ మాత్రులందరును ఈ మానవ సమాజ నిర్మాణములో భాగస్వాములే. దీనిలో మార్పురానిచో ఇది యింకను క్రుళ్ళి చెడిపోయి, యుద్ధములెక్కువై, మానవుని మనస్సు ఇంకను చెడిపోతుంది. అందువలన మీరేయైన యీ పుస్తకాన్ని చదువవలెనంటే, ఈ పుస్తకము చెప్పేదానిని వినగల నేర్పు కావాలి. వినడమంటే పుస్తకము చెప్పే దానిని వ్యాఖ్యానించడం కాదు – వివరించడం కాదు. కదులుతున్న మేఘమును గమనిస్తున్నట్లే దానిని మీరు గమనిస్తూ వుండవలెను. ఆ మేఘమును మీరేమీ చేయలేరు. అట్లే గాలిలో కదులుతున్న తాటాకులను గాని, సూర్యాస్తమయ సౌందర్యమును గాని మీరేమి చేయగలరు? వాటిని మీరు మార్చలేరు. అదేవిధంగా ఆ పుస్తకం చెప్పేదానిని వినగల నేర్పు కావాలి. ఆ పుస్తకము మీరే. అది సర్వమును వెల్లడి చేయగలదు.

ఈ జీవిత పుస్తకాన్ని చదవడానికి మరియొక నేర్పు కూడ అవసరము. అది

పరిశీలించి చూడడంలోగల నేర్పు. మీ జీవితపుస్తకాన్ని మీరు చదువుతున్నారంటే, మీరు వేరు, పుస్తకము వేరు కాదు. చదివెడి వాడు, చదువబడు పుస్తకము – రెండున్నూ మీరే. ఆ పుస్తకమే మీరు.

ఇందుకు వేరొక నేర్పుకూడా అవసరము. అది గ్రహించడంలో గల నేర్పు. కంప్యూటర్లు కూడ గ్రహిస్తాయి. వాటికొక కార్యక్రమమును, ఒక ప్రోగ్రామును* అందిస్తే, దానిని గ్రహించి యథాతథంగా ఆ ప్రోగ్రామును, మరల మనకవి అప్పగించుతాయి.

మనం మొదట అనుభవాన్ని పొందుతాము. దానివలన కొంత జ్ఞానమును సేకరిస్తాము. దానిని మన మెదడులో నిలువజేసికొంటాము. అందుండి స్మృతిరూపంలో ఆలోచనలు రాసాగుతాయి. వాటిపై ఆధారపడి పనులు సాగుతాయి. ఆ పనులవలన మరల మనము కొంత నేర్చుకొంటాము. ఆ విధంగా నేర్చుకొనడం అంటే, మరికొంత జ్ఞానాన్ని కూడబెట్టుకొనడమే. ఇదే మన మనస్సు జాగ్రత్స్థితిలో నుంటూ నిరంతరము చేస్తూవున్నపని. ఇట్లు కంప్యూటరుకున్ను మన మనస్సుకున్ను విషయగ్రహణంలో ఏమీ భేదము లేదు. అనుభవము, జ్ఞానార్జనము, స్మృతి, ఆలోచన, పిదప పని – ఈ వరుసలో మనమెప్పుడున్ను వ్యవహరిస్తూ వుంటాము. దీనినే మనము "నేర్చుకొనడం" – అంటే, అనుభవం ద్వారా నేర్చుకొనడం – అంటాము. ఇదియే మానవుని జీవితకథ – అంటే సమస్యలు, వానికి సమాధానాలున్ను. ఇట్లు మానవజాతి అనాదికాలమునుండి సంపాదించి కూడబెట్టుకొన్న సంపూర్ణజ్ఞానరాశియే ఆ 'పుస్తకము.' అదే మీరు.

బహుశా మీరు బాగా చదువుకొన్న వారై పండితులై వుండవచ్చు. అయినా, నేను దీనినంతను, సరళాతి సరళమైన – మిక్కిలి తేలికైన – భాషలో పెట్టుతున్నాను. కాని, పదమున్ను దాని అర్థమున్ను ఒకటికాదు. పద పదార్థములు ఒకటి కాదన్న యీ విషయాన్ని మీరెల్లప్పుడున్ను గుర్తించుకోవాలి. సంకేతము ఎన్నడును వాస్తవ విషయము కాదు. (సంకేతము వేరు, దానిచే సూచింపబడునది వేరు. ప్రతీకము వేరు, దానిచే ప్రతీయమానమగు నదేదో అది వేరు.)

ఈ విధంగా చూడడంలో నేర్పు, వినడంలో నేర్పు, మరియు గ్రహించడంలో నేర్పున్ను కలవు. ఇవి మూడును మూడు కళలు – దర్శనకళ, శ్రవణకళ మరియు గ్రహణకళ. అనాదికాలమునుండి మానవుని మస్తిష్కములో పేరుకొనిపోయిన జ్ఞాతవిషయ జాతమునుండి మానవుడు ఎన్నటికిని విడివడలేదు. కావున అతని గ్రహింపంతయూ యాంత్రికమే. గ్రహణకళ యన్ననో దీనికి పూర్తిగా భిన్నము. గ్రహించడం లేక నేర్చుకొనడమనగా సంపాదించుకొన్న జ్ఞానమునకుగల పరిమితుల నెరిగి మరియు అటనుండి ముందుకు సాగిపోవడం. (జ్ఞాతమునకు గల హద్దు లేమిటో తెలిసికొని ముందుకు సాగడం.)

ఇప్పుడు మన మీ మూడు విధానములద్వారా, అంటే – శ్రవణము, పరిశీలనము మరియు గ్రహణములద్వారా జీవితపుస్తకమును తోడుగా కలిసి చదువుదాం. మీరు

---

* ప్రోగ్రామనగా క్రమబద్ధమైన విషయసంపుటి.

నాతో కలిసి చదువుతున్నారు. నేను మీ పుస్తకాన్ని చదవడం లేదు; ఇద్దరమున్ను మానవ జీవితపుస్తకాన్ని చదువుతున్నాము. జీవితపుస్తకమంటే మీరు, నేను, తక్కిన మానవులందరున్ను. దయచేసి దీనిని కొంత శ్రద్ధగా గమనించండి. మనమేయైన ఈ పుస్తకమును, – అంటే, మనలను మనము – చదువుట యెట్లో తెలిసికొన్నట్లయితే, అంతటితో అన్ని ఘర్షణలు, అన్ని కష్టములు అంతమైపోతాయి. అట్టి మనస్సే వాస్తవానికి ధార్మికమైన మనస్సు (religios mind); కేవలము గ్రుడ్డిగా నమ్మేడి మనస్సుగాని, వివిధములైన కర్మకాండల నాచరించెడు మనస్సుగాని కాదు. విముక్తమైన మనస్సే ధార్మికమైనది. ఈ పుస్తకమును పూర్తిగా చదివిన మనస్సే సత్యముయొక్క ఆశీర్వాదమును పొందగలదు.

ఈ జీవితపుస్తకంలో మొదటి అధ్యాయమేది? అందలి విషయమేది? మీ పాంచభౌతిక స్వరూపము, అంటే – మీ శరీరము, అది పడెడి బాధలు, దానికి గల్గెడి వ్యాధులు, బద్ధకము (సోమరితనము), జడత్వము, సరియైన తిండి లేకపోవడము, సరియైన పోషణ లేకపోవడము – ఇవన్నీ కాకుండా, ఆ అధ్యాయములో మీరు గమనించెడి ప్రధానమగు విషయమేది? అద్దంలో మీ ముఖం మీరు చూచుకొని వుండవచ్చు, మీరు తల దువ్వుకొని వుండవచ్చు, మొగానికి పౌడరు అద్దుకొని వుండవచ్చు, ఇంకా ఏవేవో పనులు చేసికొని వుండవచ్చు. కాని, మిమ్ము మీరు ఎన్నడును చూచుకొని వుండలేదు. మిమ్ము మీరు లోతుగా గమనించి వుండినచో మీరు నకిలీ మనుషులని గ్రహింపరా? మీరు నకిలీ మనుషులని తెలిసికొనడం ఏమంత సంతోషదాయకమైన విషయం కాదు. అయినప్పటికిని, మన మనస్సులన్నీ యితరులనుండి సంపాదించిన జ్ఞానంతో – ఎవరో, ఏ గురువో బోధించిన దానితో – బుద్ధుడేమి చెప్పినాడో, ఏసుక్రీస్తు ఏమి చెప్పినాడో, ఇంకా ఎవరెవ రేమేమి చెప్పివుండిరో – ఆ మాటలతో నిండివుంటాయి. అంతేకాదు, మీరు చదివిన బడిలో, కళాశాలలో, విశ్వవిద్యాలయములో – మరెక్కడనైనా సరే, మీరేమి చేయవలెనో, ఎట్లు నడుచుకొనవలెనో, దేనిగురించి ఆలోచించవలెనో బోధించివుంటారు. కావున వాస్తవానికి మీరు నకిలీ మనుషులే. ఈ యథార్థమును మీరు గ్రహింపగల్గితే, అప్పుడు మీరు మీ మనస్సులో గూడుకట్టుకొన్న నకిలీతనమును దూరముగా నెట్టివేసి, సరియైన దృష్టితో – సమ్యక్ దృష్టితో – చూడగలరు.

దయచేసి అర్థం చేసికోండి. మన పరిశీలనలో మొట్టమొదట తెలిసే దేమంటే, మన మెల్లప్పుడు పరస్పర విరుద్ధభావనలతో జీవిస్తూంటామని. మనలో ఒక క్రమమూ, ఒక వ్యవస్థా లేవు. క్రమము లేదా వ్యవస్థయనేది అచ్చు వేసినట్లు, మూసలో పోసినట్లు – మార్పులేని పూర్వనిశ్చిత మార్గము కాదు. దేనికి తగిన స్థలంలో దానిని నిల్పుటయే వ్యవస్థ లేదా క్రమము. సహజంగా జరిగిపోయెడి పని యేదైనా, అలవాటు ప్రకారం చేసే పని యేదైనా యాంత్రికంగా జరిగిపోతూ వుంటుంది. కాని, పైన చెప్పిన వ్యవస్థ యనేది యింతకంటె గొప్పది.

కాబట్టి, ఈ పుస్తకంలోని మొదటి అధ్యాయంలో మనం గ్రహించే దేమంటే, మన జీవితాలొక క్రమంలో నడవడం లేదని, అవి మిక్కిలి అస్తవ్యస్తమైన వనిన్ని. మనమొక దానిని కోరుకొంటాము. కాని, దానిని కోరుకొనడం లేదని అంటాము.

ఒకమాట చెప్పుతాము. కాని, దానికి భిన్నంగా మరియొకటి చేస్తాము. ఒకవిధంగా ఆలోచిస్తాము. కాని, దాని ప్రకారం చేయము, మరియేదో చేస్తాము. ఈ విధంగా నిత్యము పరస్పర విరుద్ధముల మధ్య జీవిస్తూ వుంటాము. మనం చేసేదానికి, చెప్పేదానికి, ఆలోచించేదానికిన్ని – ఒకదానికొకటి – పొందిక వుండదు. ఎప్పుడైతే యీ పొందిక లేదో అప్పుడే ఘర్షణ ఆరంభమౌతుంది.

ఈ విధంగా జీవితపుస్తకాన్ని మీరు జాగ్రత్తగా చదువసాగితే మీరెంత అస్తవ్యస్తమైన జీవితము నడుపుతూ వున్నారో, నిరంతర ఘర్షణలో మీ జీవితమెట్లు నడుస్తూ వున్నదో అర్థమవుతుంది. ఆ ఘర్షణ రకరకాల కోరికలు కోరుకొనడం, వాటిని సాధించుకొనడం, ఒక వ్యక్తితోగాని దేశముతోగాని ఒక భావనతోగాని తాదాత్మ్యము పొందడం – ఇట్టి రూపములలో విస్తరించుకొని కనిపిస్తుంది. కాని, వాస్తవికాలతో జీవించడం (living in the actual) మాత్రం జరగదు. ఈ విధంగా రాజకీయంగాను, మతపరంగాను, కుటుంబ జీవితంలోనుగూడ మనము క్రమహీనమై అస్తవ్యస్తమైన జీవితములనే గడుపుతూ వుంటాము.

అయితే, సువ్యవస్థ యనగా నేమి? జీవితపుస్తకము చదవడమెట్లో తెలిసినవానికి ఆ పుస్తకమే సువ్యవస్థ యననేమో చెప్పగలదు. మీ జీవితము అవ్యవస్థితమని ఆ పుస్తకము చెప్పుతోంది. ఇంకా ముందుకుపోయి, తరువాతి పేజీలో ఏమున్నదో చూడండి – అవ్యవస్థిత జీవితమంటే యేమిటో మీకు తెలుస్తుంది. దానిని మీరు లోతుగా, యథార్థస్థితిలో గ్రహించవలెనుగాని బౌద్ధికంగా, మాటల రూపంలో పైపైన గ్రహించి లాభంలేదు – అట్లని ఆ పుస్తకమే చెప్పుతోంది. మీ యిష్టమున కనుకూలంగా దానికర్థము చెప్పుకోవద్దు. మనస్సులో ఒక అభిప్రాయమును ఏర్పరచుకోకుండా సరియైన రీతిలో దానిని చదవండి. అట్లా చదివితే మీలో పరస్పర విరుద్ధములున్నవని, ఘర్షణలున్నవని, వాని స్వరూపమెట్టిదో తెలిసికొంటే అవి నశించునని ఆ పుస్తకము చెప్పుతుంది.

సంఘములో వారు వేరు, మనము వేరు అనే భేదభావమున్నంతవరకు ఈ ఘర్షణలు తప్పవు. హిందువులు, మహమ్మదీయులు, యూదులు, అరబ్బులు, కమ్యూనిస్టులు – తద్భిన్నులు – ఇట్టి భేదమే గాకుండ మరల హిందువులలోనే రకరకాల తెగలు, కులాలు. అట్లే బౌద్ధులలోను, క్రైస్తవులలోను. అందరిలోను శాఖలు ఉపశాఖలు ఉన్నంతవరకు ఘర్షణ తప్పదు. ఎక్కడైతే భేదభావమున్నదో అక్కడ ఘర్షణ తప్పదు. అదియే అవ్యవస్థ. ఈ అవ్యవస్థ యొక్క స్వరూపస్వభావములను లోతుగా పరిశీలించి గ్రహింప గల్గినచో, ఆ గ్రహింపువల్లనే అవ్యవస్థ తొలగి, సువ్యవస్థ – దానంతట అదే – ఏర్పడుతుంది.

వ్యవస్థ (order) యనేది పూవు పుట్టుకొని వచ్చినట్లు సహజముగ నేర్పడుతుంది. అట్లేర్పడిన వ్యవస్థ – ఆ పుష్పము – ఎన్నటికిని వాడిపోదు. జీవిత పుస్తకము చదివి, భేదభావమున్నచోట – వేరుపాటున్నచోట – ఘర్షణ తప్పదని తెలిసికొన్నవాని జీవితములో ఎల్లప్పుడును వ్యవస్థ – అంటే కట్టుబాటు – తప్పక వుంటుంది.

మీ జీవితపుస్తకములోని తరువాతి అధ్యాయము ఏమి చెప్పునో పరిశీలించండి. 'నేను' అనే కేంద్రమునుండి దాని పరిధి వైపు మొగము పెట్టి పని చేస్తున్నంతకాలము పరస్పర వైరుధ్యము, ఘర్షణ తప్పవు. అంటే – అర్థమేమిటి? స్వార్థబుద్ధితో, మీ మేలు మీరు చూచుకొంటూ, మేమే సర్వసమర్థులమను తలంపుతో, కేవలము వ్యక్తిగత బుద్ధితో, ఈ విశాలమైన జీవితము (life) నంతను నేను, నాది యనెడి అల్పమగు పరిధిలోనికి సంకుచితపరచుకొని పని చేస్తున్నంతకాలము మీరు తప్పకుండ అవ్యవస్థను సృష్టిస్తారు. ఈ మమకారము, అంటే – నేను, నాది యనెడి తలంపు మీ యాలోచనలలో నుండి పుట్టుకొని వచ్చిన ఒక అల్ప విషయము. "నా పేరు, నా రూపు, నా మనస్తత్త్వము, నేనంతటివాడను, ఇంతటివాడను" – అనేదే మీ భావన. "నేనొక సమర్థుడనైన వ్యక్తిని" అని మీలో అనిపించుచుండును. కాబట్టి స్వార్థపూరితమైన, అహంకార మమకారాలతో గూడిన కర్మ జరుగుచున్నంత కాలము పరస్పర వైరుధ్యము, ఒకదానికొకటి పొందిక లేకపోవడం, అవ్యవస్థ తప్పదు. అయితే, జీవిత పుస్తక మేమంటున్నదంటే – "ఈ స్వార్థబుద్ధి లేకుండా పోవడం యెట్లు?" అని అడుగ వద్దంటున్నది. "ఎట్లు" అని మీరడగడంలో మీ వుద్దేశమేమంటే – దానికొక పద్ధతిని సూచింపుమని. కాని, మీరాపద్ధతిని అనుసరిస్తే, అదిగూడ స్వార్థముతో గూడిన పనే అవుతుంది కదా! ఇదంతా జీవితపుస్తకము మీకు చెప్పుతున్నది, నేనుగాదు చెప్పడం. జీవితపుస్తకాన్ని మీకోసమై యీ వక్త వివరించడం లేదు. మనమిద్దరము కలిసి దానిని చదువుతున్నాము.

ఎంతకాలము మీరొక జాతికి, తెగకు, సంఘమునకు లేదా మతమునకు చెందియుంటారో అంతకాలము మీరు వైరమును, ఘర్షణను పెంపొందిస్తూనే వుంటారు. ఈ కఠోర సత్యాన్ని, ఈ చేదు నిజాన్ని దిగమింగడం చాల కష్టమైన పని. ఏలయన, మన కందరకు ఏదోయొక దానియందు నమ్మకమున్నది. మీకు దేవునిమీద నమ్మకముంటుంది, ఇంకొకరికుండదు. ఒకరు బుద్ధున్ని నమ్మితే మరియొకరు ఏసుక్రీస్తును నమ్ముతారు. ఇదంతా కాదు, మరియొకటి ఏదో వుందని ఇస్లాంమత మంటుంది. అందువలన యీ నమ్మకమనేది మనిషికీ మనిషికీ మధ్య విరోధాన్ని కలిగిస్తుంది. వారిమధ్య వుండవలసిన సంబంధాన్ని చెడగొట్టుతుంది. కాని కేవలము వాస్తవిక పరిస్థితులతోనే మనకుగల అక్కఱ, అవసరమున్ను అయినపుడు ఈ నమ్మకములతో మనకు పనియేమి? వాస్తవిక పరిస్థితులంటే ప్రత్యక్షంగా మీ జీవిత పుస్తకంలో జరుగుతున్న విషయాలే.

జీవితపుస్తకాన్ని చదవడం ఎట్లాగా అనేది యిప్పుడున్న సమస్య. ఆ జీవితపుస్తకము మీకంటె భిన్నమా? మీరేదైన నవలగాని, ఒడలు జలదరింప జేసే మరే పుస్తకముగాని చదువుతున్నప్పుడు, అది వేరు మీరు వేరు కాబట్టి, దాని పేజీలు త్రిప్పుతూ, అందులోని కథకు ఆనందముగాని ఉద్రేకముగాని పొందుతూ చదువుతారు. కాని యిక్కడ పాఠకుడే పుస్తకము, అంటే – తనలోని ఒకభాగమునే తాను చదువుతున్నట్లు. అంతేగాని, వేరే పుస్తకమును చదువుతున్నట్లు కాదు. ఆ జీవితపుస్తకమింకా ఏమి చెప్పుతున్నదంటే, మనిషి సదా ఎవరో యొకరి అధికారమునకు లోబడే జీవిస్తూ వచ్చినాడని. రాజకీయంగా గాని, మతపరంగా గాని, ఏ నాయకుడో, గురువో,

ఏ బుద్ధిమంతుడో, వేదాంతియో లేదా తనకన్నీ తెలుసుననుకొనే ఎవనికో లోబడే జీవిస్తూ వచ్చినాడని చెప్పుతోంది. మానవు డెల్లప్పుడున్నూ ఏదోయొక అధికార విధానానికి అనుగుణంగా నడుచుకొనుట కలవాటు పడినాడు. ఇంకా దయచేసి మీ జీవితపుస్తకం ఏమి చెప్పుతోందో జాగ్రత్తగా వినండి. మీకు సమ్మతమైనాసరే, కాకున్నాసరే చట్టమనేది యొకటున్నది. రక్షకభటులున్నారు. ఎన్నుకొనబడిన ప్రభుత్వమో లేక నియంతృత్వమో ఉన్నది. వీరందరి చేతులలోను అధికార మున్నది. కాని, మనమిక్కడ వారి యధికారము గురించి మాట్లాడడం లేదు. మన మిక్కడ జీవిత పుస్తకమును చదువుతున్నాము. ఇందులో మనస్సు తన భద్రతకోసమై ఆశ్రయించెడి అధికారము గురించి చదువుతున్నాము.

మన సెల్లప్పుడును తన భద్రత కోరుకుంటూ వుంటుంది. మీరేనాడైతే మానసికంగా భద్రతను కోరుకొంటారో ఆనాడే తప్పనిసరిగా మీ పై అధికారిని మీరే సృష్టించుకొంటారు. అట్లు మీకు భద్రతనీయగల అధికారి పూజారి కావచ్చును, పురోహితుడు కావచ్చును. ఒక విగ్రహమో లేదా ప్రతిమయో కావచ్చును. లేదా "నేను దైవసాక్షాత్కారమును పొందినాను, నీకును చెప్పుతాను ర"మ్మని పిలిచే యే మానవుడైనా కావచ్చును. కాని, మీ జీవితపుస్తక మేమంటుందంటే, ఆ విధమైన అధికారులను, పెద్దలను అందరినీ వదిలి పెట్టమని, వదిలించుకోమని. అంటే యేమిటి? మీపై మీరే ఆధారపడమని, మీకు మీరే వెలుగుకమ్మని చెప్పుతున్నది. జీవితము నర్థము చేసికొనడానికి – మీ జీవితపుస్తకాన్ని మీరు అర్థము చేసికొనడానికి – ఇతరులెవ్వరిమీదను ఆధారపడవద్దని చెప్పుతున్నది.

ఆ పుస్తకమును చదివేటప్పుడు మీకును ఆ పుస్తకానికిన్ని మధ్య ఎవరును లేరు. ఏ వేదాంతిగాని, గురువుగాని, పూజారిగాని, దేవుడుగాని ఎవరునూ లేరు. మీరే ఆ పుస్తకము. దానిని మీరు చదువుతున్నారు. కాబట్టి, యితరుల కిందులో ప్రమేయము లేదు. ఇతరుల అధికారమునకు లోబడనక్కరలేదు. అది భర్తయొక్క అధికారముగాని, భార్యయొక్క అధికారముగాని, దేనికిని అక్కడ చోటు లేదు. అన్ని విధములయిన అధికారములనుండి విముక్తి పొందవలెను. అంటే, ఒంటరిగా మీకు మీరే నిలబడగలిగి యుండవలెను.

ఈ విధంగా మీరు మీ జీవిత పుస్తకంలోని మొదటి అధ్యాయములో మీలోని అవ్యవస్థ, మరియు వ్యవస్థ మరియు మీమీద ఇతరులు చూపెడి అధికారమును గురించి చదివితిరని, దానిని చర్చించితిరని మీ పుస్తకమే చెప్పుతున్నది. ఇక తరువాతి అధ్యాయము, "పరస్పర సంబంధమే జీవిత"మని అంటున్నది. జీవితమంటే ఆచరణలోనున్న పరస్పర సంబంధమే. ఈ సంబంధము మీ ఆప్తులతోనేగాదు, ప్రపంచములోని ప్రతియొక్కనితోను – అంటే, సంపూర్ణ మానవజాతితోనే కలదు. ఇతర మానవుల వలెనే మీరున్ను, వారెక్కడి వారైనా సరే. ఏలయన, వారు దుఃఖ మనుభవిస్తున్నారు, మీరున్ను అనుభవిస్తున్నారు. అట్లే అన్ని విషయాలలోను. మనస్సు యొక్క స్వభావమును బట్టి మీరే ప్రపంచము, ప్రపంచమే మీరు. కాబట్టి మీకు గల బాధ్యత అత్యధికమైనది. తరువాతి అధ్యాయములో జీవిత పుస్తకం ఏమి చెప్పుతున్నదంటే, అనాదికాలము నుండి మానవుడు భయముతోనే

జీవిస్తున్నాడని. భయమంటే, యీ దృశ్యమానమగు (కంటికి కనబడే) ప్రకృతివల్లను, పరిసరములవల్లను, వ్యాధులవల్లను, ప్రమాదములవల్లను – ఇంకను ఇటువంటివాటివల్ల గలిగెడి భయమే కాదు, మన మనస్సులో లోతైన పొరలమధ్య, మిక్కిలి లోతున, మన స్మృతికందని, మనమడుగుపెట్టని భయతరంగములు గూడ గ్రహింపబడతాయి. మన మిద్దరము కలిసి తోడుగా యీ అధ్యాయము తుదివరకు చదివితే, "దానిని (భయమును) సావధానముగా పరికిస్తే (watch it), అది తొలగిపోతుం"దని ఆ పుస్తకము మనకు చెప్పుతుంది.

తరువాతి పేజీలో ఆ పుస్తకం యిట్లా చెప్పుతుంది – "భయమంటే యేమిటి? అది యెట్లు పుట్టుతుంది? దాని స్వభావమేమి? ఈ సమస్యను మానవుడేల పరిష్కరించుకోలేక పోయినాడు? ఆ భయముతోనే యెందుకు జీవిస్తున్నాడు? దాని కలవాటుపడిపోయినాడా? జీవితమంటే అదే యనుకొన్నాడా? జీవితంలో భయమొక భాగమని, అది తప్పదని అనుకొన్నాడా? మానవుడు – అంటే, మీరు – ఈ సమస్యను పరిష్కరించుకొని మీ మనస్సును పూర్తిగా భయవిముక్తమేల చేసికొనలేదు? భయమున్నంతదనుక మీ జీవిత మంధకారమయము. మీ పూజాపురస్కారములు, మీ ఉపాసనలు అన్నీ ఆ యంధకారములో నుండియే జరుపబడుతుంటాయి. కాబట్టి అవియన్నియు పూర్తిగా అర్థరహితములు."

భయముయొక్క స్వరూప స్వభావముల గురించి యింకా తెలిసికొనడం చాల అవసరం. భయమనేది యెట్లా పుట్టుతుంది? గడచిపోయిన విషయాలు జ్ఞాపకం రావడమా దానికి కారణం? అంటే, యింతకుముందు మీరనుభవించినట్టి యేదైనా బాధ లేదా చేయగూడని అపచారం మీరేదైనా చేసివుంటే అది, లేదా – మీరు చెప్పియున్న అసత్యము – దాని నెవరును కనుక్కోకుండా వుంటే బాగుంటుందని, అయినా, అది యెప్పటికైనా బయట పడిపోతుందేమోయని మీరు భయపడెడి సత్యము – ఇవి యేవైనా భయకారణాలు కావచ్చును. మీ మనస్సును తొలిచివేసి డగొట్టిన – మీ మనస్సును పాడుచేసిన పని యేదైనా సరే, దానికి మీరు యపడతారు. లేదా, భవిష్యత్తును గూర్చి భయపడుతూ వుండవచ్చు. మీ వుద్యోగం ంతుందనిగాని లేదా మీ దేశంలో మీరున్న ఒక మారుమూల ప్రాంతంలో మీకు తగినంత పేరుప్రఖ్యాతులు రాలేదనిగాని భయపడుతూ వుండవచ్చు. ఈ విధంగా భయకారణములకు లెక్కలేదు. కొందరికి చీకటి అంటే భయం. కొందరికి పదిమందిలో మాట పడడమంటే భయం. మృత్యువంటే మరికొందరికి భయం. ఏమీ సాధింపలేకపోతిమే యని యింకొందరి భయం – ఆ సాధించడానికి అర్థమేమో వారికే తెలియాలి. జబ్బు అంటే అందరికీ భయమే. ఒకడు శారీరకంగా పెద్ద బాధ – నొప్పి – అనుభవించి యుండవచ్చు. అది మనస్సులో నాటుకొనిపోయి వుంటుంది. ఆ బాధ – ఆ నొప్పి – మళ్ళీ వస్తుందేమోయని భయం. ఈ విధంగా భయము లెన్నో!

అయితే, ఇంకా లోతుగా తరచి చూడమని పుస్తకం చెప్పుతున్నది. భయమంటే యేమిటి? అది మీ యాలోచనల మూలమున కలిగినదా? లేక కాలమువలన

కలిగినదా? "నేనిప్పు డారోగ్యముగా వున్నాను కాని, ముసలివాణ్ణి అయ్యేకొలది జబ్బు పడతాను. అందుకు నాకు భయంగా వున్నది" – అదీ కాలమంటే.

లేదా – మనస్సు అంటుంది గదా, "నాకేమైనా జరుగవచ్చు; నా వుద్యోగం పోవచ్చు, నేను గ్రుడ్డివాణ్ణి కావచ్చు, నా భార్య చనిపోవచ్చు లేదా, నన్ను విడిచిపెట్టి పోవచ్చు. ఇంకా యేమైనా జరుగవచ్చు." – ఇదేనా, భయకారణం? పుస్తకం మిమ్ము అడుగుతున్నది: "ఇంకొక పేజీ త్రిప్పి చూడండి, దానికి జవాబు మీకక్కడ లభిస్తుంది." ఈ విషయం ఈ ఉపన్యాసకుడు కాదు మీకు చెప్పడం. మీ జీవితపుస్తకమే మీకు చెప్పుతూ వున్నది. "భయమునకు మూలము ఆలోచన మరియు కాలము. అయితే, ఆలోచనయే కాలము!"

"మానవుని మనస్సునకు అంటే, మీ జీవితపుస్తకాన్ని చదువుతున్న మీకు – మీరే ఆ జీవితపుస్తకము, అన్యము కాదు – భయమునుండి పూర్తిగా విముక్తమగుట సాధ్యమా? భయలేశము గూడా లేకుండపోగలదా?" యని పుస్తకంలోని తరువాతి పేజీ మిమ్ము అడుగుతున్నది.

మళ్ళీ అదే అంటున్నది – "దీనికొకపద్ధతి చెప్పమని అడుగవ"ద్దని. పద్ధతి అంటే – ఏదైనా ఒక పని మళ్ళీ మళ్ళీ చెయ్యడం లేదా, యొక నిశ్చితమైన మార్గం. మీరు కనిపెట్టిన ఆ మార్గం భయాన్ని పోగొట్టజాలదు. ఎందుకంటే మీరొక నిశ్చితమైన మార్గాన్ని అనుసరిస్తూ పోతున్నారేగాని, అసలు భయమంటే యేమిటో, దాని స్వరూపమేమిటో తెలిసికొనడం లేదు. అందుచేత ఒక పద్ధతి, ఒక మార్గము కోసం వెదకవద్దు. భయస్వరూపమును అర్థం చేసికోండి.

"మరి అర్థంచేసికోడమంటే యేమిటి" అని పుస్తకం ప్రశ్నిస్తున్నది. బౌద్ధిక వ్యాపారమైన వాక్యరచనా విధానమును, అందలి మాటలకు అర్థమును తెలిసికొనడమా, లేదా – అసలు సత్యమేమిటో గ్రహించడమా? దీనియొక్క అసలు సత్యాన్ని గ్రహిస్తే అదే అదృశ్యమైపోతుంది. అంటే, భయానికి మూలకారణాలు మనస్సులోని ఆలోచనలు మరియు కాలమున్ను అని మీరు స్పష్టంగా గ్రహిస్తే – కేవలం మౌఖికమైన వాక్యరూపంలో, పైపైనకాదు – మీలో అదియొక భాగంగా గ్రహిస్తే, అంటే – ఆ యవగాహన మీ రక్తంలో, మీ మనస్సులో, మీ హృదయంలో భాగమగునట్లుగా గ్రహిస్తే – ఏమని, "కాలమే భయకారణ"మని గ్రహిస్తే, అప్పుడు భయానికి ప్రాధాన్యము లేకుండా పోతుంది. కాలమే ప్రధానమవుతుంది.

ఎందుకనగా, మనస్సులోని ఆలోచన మరియు కాలమున్ను భయాన్ని సృష్టించినవి. "ఏమి జరుగబోతున్నదోయని భయపడుతున్నాను. ఒంటరితనమునకు భయపడుతున్నాను. ఒంటరితనాన్ని నేనెప్పుడున్ను పరీక్షించి చూడలేదు. అదేమిటో పరిశీలించలేదు. కాని, దానికి భయపడుతున్నాను! దాని నుండి పారిపోతున్నాను." ఇంతకున్ను ఆ యొంటరి తనము – ఆ యేకాకి తనము – నా నీడయే. అది నన్నంటిపెట్టుకొనియే వుంటుంది. మీ నీడను వదలి మీరు పారిపోలేరు. అందుకని ఓర్పుతో దానిని మీరు పరిశీలిస్తే – అంటే, పారిపోవడం కాదు, పరిశీలించడం చేస్తే, ఆ పుస్తకం ఏమి చెప్పుతున్నదో శ్రద్ధగా వింటే, – దీనికంతకును కారణం

కాలమని, వేరే భయము లేదని తెలుస్తుంది. కాబట్టి, మీరు కాలాన్ని అర్థం చేసికోవాలి. కాలాన్ని అర్థం చేసికొంటే భయం దానంతట అదే పోతుంది.

అయితే, మనస్సులోని ఆలోచనకున్ను కాలానికిన్ని గల సంబంధమేమిటి? ఇది తెలిసికోమని పుస్తకం తరువాత పేజీలో చెప్పుతున్నది. ఒక తెలిసిన విషయము నుండి మరియొక తెలిసిన విషయమునకు పయనించుటయే ఆలోచన. ఇదియొక విధమైన చలనము. గతకాలపు స్మృతులు వర్తమానకాలపు వాస్తవములతో కలిసి మార్పు చెంది, యింకా ముందుకు పోవడం. అంటే, నిన్నటిదినము ఈనాటిగుండా పయనించి రేపటి దినమును చేరడం. ఇదియే కాలగమనము. సూర్యోదయము, సూర్యాస్తమయము. మరల సూర్యోదయము.

ఇంతేకాదు, మానసికమైన కాలగణనము కూడ కలదు (Psychological Time). అంటే, "నాకు నొప్పి అంటే తెలుసును. మళ్ళీ నాకానొప్పి రాకుండా వుండాలని కోరుకొంటాను. కాని, మళ్ళీ రావచ్చు" – ఇదే గతమునుండి వర్తమానము ద్వారా మార్పుచెందుతూ, భవిష్యత్తునకు పయనించడం.

గడియారము ద్వారా తెలిసికొనెడి కాలము మరియొకటి. మన అంతస్సులో వుండే కాలమున్ను కలదు. ఏదోయొక స్థికి చేరుకొనగలమని ఆశిస్తాము. కాని మన మిప్పుడున్న స్థితి అదికాదు. ఇప్పుడు మీరు దుర్జనులు, దుస్సాహసము చేయువారు కాని, సజ్జనులుగా వుండగోరుతారు. సౌజన్యమును సంపాదింపగోరుతారు. అట్లే యిప్పుడు మీరు ఆశాపరులు, అసూయాపరులు. కాని, కాలక్రమేణ పరిణతి చెందుతూ, ఆ చెడ్డగుణములను పోగొట్టుకొన గోరుతారు.

కాబట్టి, కాలమంటే గతమునుండి వర్తమానము ద్వారా భవిష్యత్తునకు పయనించడం. అట్లే ఆలోచనగూడ గతములో సంపాదించుకొన్న జ్ఞానము, దాని స్మృతి, ందుండి ముందుకు సాగడం. ఈ విధంగా ఆలోచనయే కాలము, కాలమే ఆలోచన.

తరువాతి ప్రశ్నకు సమాధానము చెప్పడం కష్టము. అంత దూరం పోవాలంటే ాల ఓరిమి కావాలి. ఈ 'ఓరిమి' అనే పదాన్ని నేనొక విశేషార్థంలో వుపయోగిస్తున్నాను. ాధారణంగా 'ఓరిమి' అంటే మెల్లగా పోవడం, ఓర్పు కలిగియుండడం. ఏదైనా ని చేయడానికి మరికొంత యెక్కువకాలము తీసికోవడం, దేనికైనా అనుకూలంగా ాని, ప్రతికూలంగా గాని మనస్సు త్వరగా వికారము పొందకుండడం, శాంతంగా వుండడం, ఏ సమస్యనైనా తేలికగా తీసికోడం, ఎదుటివానికి తాను చెప్పకోవడం కోసం తగినంత అవకాశ మివ్వడం, ఇంకా యెన్నో యిట్టి అర్థాలలో 'ఓరిమి' అనే పదాన్ని వాడతాము. ఆ అర్థాలలో మన మిప్పుడు ఓరిమి అనే పదాన్ని వాడడం లేదు. మనమనేది, 'ఓరిమి' అనగా కాలము ఆగిపోవడం, కాలము లేకపోవడం, కాలాన్ని స్మృతిపథంలోకి తీసికొని రాకుండడం. అప్పుడే మీరు సరిగా చూడగలరు, పరిశీలించగలరు. కాని, కాలము ద్వారా – కాలగమనమును స్మృతియందుంచుకొని – చూడసాగితే, మీకు ఓరిమి లేనట్లే. ఈ అధ్యాయమును చదవడానికి మీకు ఓరిమి వుండాలి. భయానికి కాలమే కారణము. ఆలోచనయే కాలము. అందుచే ఆలోచన, అనగా – మనస్సు పనిచేస్తున్నంతకాలము మీకు భయము తప్పదు.

తరువాతి అధ్యాయము చెప్తూ వుంది:– కాలమాగి పోవడం అనేది వున్నదా? కాలమంతమవడం అనేది వున్నదా? మన జీవితంలో కాలమునకుగల పాత్ర, దాని ప్రాధాన్యము చాల గొప్పది. "నేననుకొన్నట్లుగా ఇప్పుడు లేను. ఇక మీద ఎప్పుడో వుంటాను. ఇప్పుడు నాకు తెలియదు కాని, కొంతకాలానికి నాకు తెలుస్తుంది. ఈ భాష నాకిప్పుడు తెలియదు. కాని, నాకు కొంత వ్యవధి యిస్తే నేను దాన్ని నేర్చుకోగలను. మన గాయాల నన్నిటిని కాలమే మాన్పగలదు. కాలము మన సున్నితమైన మనస్సును మొద్దుబారజేస్తుంది. కాలము మనకు ఇతరులతో గల సంబంధాన్ని – పరస్పర సంబంధాన్ని – చెడగొట్టుతుంది. కాలము (అంటే ఆలోచన) మన అవగాహనను నశింపజేస్తుంది. ఎందుకంటే, అవగాహనమనగా సద్యః కాలమున – తక్షణమున – వెంటనే జరుగునది. "అవగాహన జేసికోవడానికై ప్రయత్నిస్తాను. అది యెట్లో నేర్చుకొంటాను" – అని అంటే అది అవగాహనయే కాదు.

కాబట్టి, పుస్తకమంటున్నది గదా – మన జీవితములో కాలమునకు గల పాత్ర అసాధారణమైనది, అతి ముఖ్యమైనది అని. మన మెదడులు కాలక్రమేణ పరిణతి చెందినవి. ఆ మెదడు నీదికాదు, నాదీకాదు. అది మనిషి యొక్క మెదడు, మానవ మస్తిష్కము. మానవుని మనస్సు అంటే 'మీరు.' ఆ మానవుని మస్తిష్కమును మీరు మీ మస్తిష్కముగా, మీ మనస్సుగా ఆరోపించుకొన్నారు. దానితో తాదాత్మ్యము చెందినారు. కాని, అది మీ మనస్సు కాదు, మీ మస్తిష్కము కాదు. అది మానవ మస్తిష్కము, లక్షల కొలది సంవత్సరాల నుండి పరిణతి చెందిన మస్తిష్కము. అది కాలమునకు వశమైనది, కాలము తెచ్చిన మార్పులకు లోనైనది కాబట్టి, కాలములోనే పని చేయగలదు. అయితే, దానికి పూర్తిగా భిన్నమైన పనిని చేయమని మనమిప్పుడా మస్తిష్కమును ప్రేరేపించుచున్నాము. పుస్తకమంటుందిగదా – మీ మెదడు, మీ మనస్సు కాలమునకు లోబడియే పని చేయునవి. కాలము మీ జీవితములో చాల ముఖ్యపాత్ర వహించినది. అది యే సమస్యనూ పరిష్కరింపజాలదు, యంత్ర సంబంధమైన (technological) సమస్యలను తప్ప. ఏ సమస్యాపరిష్కారమునకున్ను కాలముపయోగపడదు. మీకును మీ భార్యకును మధ్యగలట్టి లేదా, మీకును మీ వుద్యోగానికిని సంబంధించినట్టి లేదా, యింకే సమస్యకైనను కాలమెన్నటికిని పరిష్కారము కాబోదు. ఇది అర్థము చేసికొనడం చాల కష్టము. అందుచేత మీ మనస్సంతా దానిపై నిలిపి మీ జీవితపుస్తకాన్ని సరియైన విధమున చదవండి.

ఆ పుస్తకమేమని అడుగుతున్నదంటే – కాలము అంతము కాగలదా? అని అడుగుతున్నది. మీరు దానిని అంతము చేయకపోతే భయమున్ను దానిపరిణామములున్ను కొనసాగుతూనే వుంటాయి. ఇంకా ఆ పుస్తకం అనేదేమంటే, "కాలము నెట్లు అంతం చేయాలి" అని అడగవద్దంటుంది. కాలమునెట్లు అంతం చేయాలి అని మీరడిగినారంటే దానిభావం మీరాపుస్తకమును – మీ జీవిత పుస్తకమును – చదువలేదని. కేవలము నోటిమాటలతో ఒక సిద్ధాంతాన్ని వల్లిస్తున్నారని దాని భావము.

ఇదంతా యేమైనా మీకర్థమవుతున్నదా? యని నా సందేహము. కాల మెన్నటికైనా నిలిచిపోతుందాయనే విచారణయే నిజమైన ధ్యానము (Meditation).

కాలము తప్పక ఆగిపోగలదని, ఆగిపోతుందని ఈ వక్త చెప్పుతున్నాడు. కాని మీ పుస్తకం చెప్పడం లేదు. మీ పుస్తకాన్ని మీరు నమ్ముతున్నారా? మీ పుస్తకం మీద మీరు నమ్మకం పెట్టుకొన్నారా? నమ్మకం పెట్టుకొంటే, మీరు మీ జీవితపుస్తకాన్ని చదవడం లేదని అర్థము. మీరు కేవలం మాటలమీద ఆధారపడి జీవిస్తున్నారు. మాటలమీద ఆధారపడితే భయము అంతమవుతుందా? కాదు. కాబట్టి, మీరు మీ జీవితపుస్తకాన్ని అంటే, కాలమనే పుస్తకాన్ని చదువవలసిందే. ఆ పుస్తకాన్ని లోతుగా తరచి చూడండి. కాలముయొక్క స్వరూపమేమిటో, అది మీయందెట్టి భావములను పుట్టిస్తున్నదో – దానికి మీ ప్రతిక్రియ (reaction) యేమిటో – ఇతరులతో మీకుగల సంబంధము కాలముపై ఎట్లు ఆధారపడియున్నదో లోతుగా పరిశీలించండి.

మీరు సేకరించిన జ్ఞాన రాశియే కాలము. ఆ జ్ఞాన రాశిని మీరు మీ పురోభివృద్ధికి ఒక సాధనంగా యెప్పుడైతే వుపయోగించుకొనడం ఆరంభిస్తారో అప్పుడే మీరు కాలానికి వశమైపోయినారన్నమాట. దానితోబాటే భయము, ఆందోళన – ఈ క్రమమంతా మరల ఆరంభమవుతుంది.

కాలము నంతము చేయడమంటే యేమిటో తెలిసికోవాలంటే శాంతమైన మనస్సు అంటే, ఆలోచనల గందరగోళము తగ్గిపోయిన మనస్సు కావాలి. అట్టి మనస్సే ఎట్టి భయములేకుండ, స్వేచ్ఛగా పరిశీలింపగలదు. దేనిని? మీలోని కాలగమనమును, మీలో కాలము పనిచేయు తీరును, దానిమీద మీరెంతగా ఆధారపడివున్నదిన్ని.

భవిష్యత్తుపై ఆశపెట్టుకోవద్దని ఎవరైనా మీతో అంటే అదిరిపోతారు కదా! కాని, నేను అనేదేమిటో తెలుసా? "భవిష్యత్తుపై ఆశ" (Hope is time) అంటే కాలమేయని.

కాబట్టి, మీరు కాలస్వరూపాన్ని విమర్శించి తెలిసికోండి. మీ మెదడు, మీ మనస్సు, మీ హృదయము – ఏదన్నా ఒకటే – కాలమునకు వశమై పనిచేస్తున్నాయి. కాలముచే నడుపబడుతున్నాయి – కాలముచే నియంత్రితములు. కాబట్టి మీరు కోరేది దానికి పూర్తిగా విరుద్ధమైన విషయము.

మీరు మెదడును, అంటే మనస్సును విభిన్నమైన క్రొత్తమార్గమున పనిచేయించ గోరుతున్నారు. దానికోసం మీరు మిక్కిలి సావధానముగా, మిక్కిలి శ్రద్ధగా జీవిత పుస్తకాన్ని చదువవలసి వుంటుంది.

*కొలంబో,*
*9-11-1980.*

★ ★ ★

# 3. కోరిక, విషయసుఖము, దుఃఖము, మృత్యువు
## (Desire, Pleasure, Sorrow and Death)

ప్రతివాడు మూడు కళలు నేర్చుకోవాలి - శ్రవణకళ, దర్శనకళ, గ్రహణకళ - (వినడంలో నేర్పు, చూడడంలో నేర్పు, గ్రహించడంలో లేదా నేర్చుకోడంలో నేర్పు). శ్రవణకళ అంటే మీరు విన్నదానికి మీ అలవాటు ప్రకారం అర్థం చెప్పుకోవడం కాదు. వక్త చెప్పుతున్నదేమిటో తెలిసికోడానికి ప్రయత్నించాలి. దానితోబాటు మీ సొంత ఆలోచనలను, మీ సొంత భావోద్రేకాలను, మీ సొంత ప్రతిక్రియలను గూడ విన గలగాలి. వాటిని మార్చడానికి ప్రయత్నించకూడదు, వాటిని అణచివేయడానికి ప్రయత్నించకూడదు; కేవలం వాటిని గమనించాలి, శ్రద్ధగా శాంతంగా వినాలి. ఇక దర్శనకళ అంటే మీ కన్నులతో, మీ కంటి భాగములలో గలిగే ప్రతిక్రియలద్వారా చూడడమే కాదు, వాడిన పదములకు మించి, అందులో వ్యంజితమగు భావములను, వాటిలోని అంతరార్థమును గూడ చూడాలి. ఎందువల్లనంటే, పదములను, వాటి అర్థములను ఒకటి కాదుగదా? పర్వతము యొక్క వర్ణనము పర్వతము కాదుగదా? 'నది'యనే పదము జీవశక్తి గలిగి ప్రవహించుచున్న నీటిమొత్తము కాదు గదా? 'నది' యనేది ఒక పదము, దానిచే సూచింపబడేది సజీవమగు జలప్రవాహము. రెండును ఒకటి కాదు గదా? అందువలన మిక్కిలి అవధానంతో, సూక్ష్మదృష్టితో, చాల జాగ్రత్తగాను గమనించి చూడాలి. మూడవది గ్రహణకళ - చాల క్లిష్టమైనది.

ఈ విధంగా శ్రవణకళ, దర్శనకళ, గ్రహణకళ యనేవి మూడు కళలు. జ్ఞానమును కూడబెట్టుకోవడానికి మన మలవాటు పడియున్నాము. ఆ జ్ఞానము అనుభవంద్వారా కలిగి, మెదడులో స్మృతిరూపమున నిలువ జేయబడి వుంటుంది. ఆ స్మృతి క్షేత్రంలోనే మన మెల్లప్పుడును పనిచేస్తూ వుంటాము. అంటే, మన కర్మాచరణ మెల్లప్పుడును స్మృతిమీదనే ఆధారపడి వుంటుంది. జ్ఞానమనేది భూతకాలమునకు సంబంధించినది. అది వర్తమాన కాలమునందు కొంత మార్పుచెంది భవిష్యత్తులో కొనసాగుతూ వుంటుంది. అట్టి జ్ఞానక్షేత్రమునందే మన కర్మాచరణము కొనసాగుతూ వుంటుంది. ఇట్లు అనుభవము ద్వారా సంపాదించిన జ్ఞానము స్మృతి రూపమున నిలువజేయబడి యుండగా, ఆ స్మృతి సహాయమున, తెలివిగానో తెలివి తక్కువగానో వ్యవహరించడమునే మామూలుగా నేర్చుకోవడమంటాము (Learning). మన మనస్సులు సర్వదా చేస్తున్నపని యిదే:-

అక్కడ ఘర్షణ తప్పదు. మనము పుట్టిన క్షణము మొదలు చచ్చిపోవు క్షణము వరకు మన మనస్సులు ఘర్షణకు అలవాటుపడి వున్నాయి. ఇది లోపలను బయటను జరిగెడి నిత్యసంఘర్షణము, ఎడతెగని పోరాటము, నిరంతర సంగ్రామము. ఆలోచనకును ఆలోచించే వానికిని భేదము లేదని, ఆలోచనయే ఆలోచించేవాడని – ఈ యథార్థమును కేవలం మాటలతో గాకుండా, కేవలం సిద్ధాంతరీత్యా గాకుండా – వాస్తవంగా గ్రహించినట్లయితే అప్పుడు సంఘర్షణ యొక్క స్వభావమున్ను, అది అంతమగు విధమున్ను అవగతము కాసాగును.

ఈ సాయంకాలం మనం కోరిక, విషయ సుఖము, బాధానుభవము – వీటి స్వరూపస్వభావములను గురించి విచారణ చేసి, ఇంకా సమయముంటే – మృత్యువు, దాని యర్థము, దాని ప్రాముఖ్యమును గూర్చికూడ విచారణ చేద్దాము. మొత్తం మానవజాతి గురించి శ్రద్ధ తీసికొనే మనిషి, మానవునికిగల బాధలు, సంఘర్షణలు, హింస, జీవితంలో అతడనుభవించెడి రకరకాల యాతనలు – వీటన్నింటి గురించి చింతించే మనిషి, మొట్టమొదట కోరిక, దాని స్వరూపస్వభావముల గూర్చి విచారణ చేయవలసి వుంటుంది. మన జీవితంలో కోరికకు గల స్థానము చాల ముఖ్యమైనది, వ్యాపకమైనది. మీరు పెరిగేకొలది, మరికొంత యుక్తవయస్సు వచ్చేసరికి, మీకు కలిగే కోరికలలో మార్పు వస్తుంది; అంటే, కోరుకొనే విషయాలలో మార్పుంటుంది గాని, కోరికలో మార్పుండదు. మీరు కారును కోరుకొన్నా, కాంతను కోరుకున్నా, దేవుని కోరుకున్నా, దివ్యమైన వెలుగును కోరుకొన్నా అసలు కోరిక అనేదానిలో మార్పులేదు. ఉత్తమమైన కోరిక, అధమమైన కోరిక అంటూ లేదు. కోరిక అంటే కోరికే, అదేదైనా గాని. సంకల్పముతో గూడిన కోరిక జీవితం పొడుగునా వుంటుంది. కోరిక అంటే సంకల్పమే. రాశీభూతమైన కోరికయే సంకల్పము. "నేను చేయాలి, నేను చేయగూడదు" – ఇట్టి సంకల్పముతో మనము వ్యవహరిస్తూ వుంటాము. సంకల్పమిట్లు నిరంతరము ప్రవర్తించడమే కోరికలోని ముఖ్యతత్త్వము. కోరిక అంటే యేమిటో గమనించి చూడడంలోనే దాని తత్త్వము, దాని లోతుపాతులు మన కవగతము కాసాగుతాయి. దాని లోతుపాతుల నెరిగినట్లయితే, దానిని అవగాహన చేసికొన్నట్లయితే అదీ – కోరిక – యెట్లా ఏర్పడుతుందో మరల చెప్పవలసిన అవసరం లేదు; అది యెట్లా పని చేస్తుందో మరల విచారించవలసిన అవసరం లేదు. ఆ విచారణ చేసినా అది కేవలం నోటిమాటలతో చెప్పడమవుతుంది. ఏదైనా గడియారాన్ని పరిశీలించి చూచినప్పుడు, దానిని విప్పదీసి పరీక్షించినప్పుడు, అది యెట్లా పని చేస్తున్నదో గమనించినప్పుడు, సహజంగానే ఆ గడియారం యొక్క కదలికను గూర్చి, అది పనిచేసే తీరునుగూర్చి మీరు నేర్చుకొంటున్నారు. గడియారం కదలడం చూచి, అది యెట్లు పని చేస్తుందో నేర్చుకొంటున్నారు. సరేనా?

మన మిప్పుడు కోరిక అనేదానిని పరిశీలిస్తున్నాము. కోరిక అంటే యేమిటో మీకు తెలుసు; చాలమందికి తెలుసు. మన జీవితంలో ఇంత ముఖ్యమైన పాత్ర వహించునట్టి కోరిక అంటే యేమిటి? అనేక మతముల వారు, అల్పముగా భేదించు వివిధ మతశాఖలకు సంబంధించిన సన్న్యాసులు, శ్రమణకులు అందరూ, "కోరికల నణచుకోండి; వాటిని మరియొక రూపములోనికి మార్చుకోండి" అని సదా బోధిస్తూ

వుంటారు. "మీరు భగవంతుని సేవ చేయదలచుకొన్నట్లయితే యీ సంసారం మీద, స్త్రీలమీద, పురుషుల మీద దేనిమీదను కోరికలు పెట్టుకోరా" దని అంటారు. ఇట్లా కోరికలను క్రమశిక్షణలో పెట్టుకోవడమనేది వాటిని అణచివేసే ప్రక్రియగా వుంటూ వచ్చినది. కాని, మనమిప్పుడు కోరికను అణచి వేయడం లేదు, దానినుండి తప్పించుకొని పోజూడడం లేదు, దానిని మరొక రూపంలోకి మార్చడమూ లేదు, హేతువులు చూపి దానిని సమర్థించడమూ లేదు. కోరిక యొక్క స్వభావాన్ని మాత్రమే పరీక్షిస్తున్నాము. దానిని తప్పించుకోజూడడమనే ప్రశ్నే లేదు. దానినుండి తప్పించుకొని పోదామనే ప్రయత్నంతో దానిని చూడడం లేదు. మనమందరం కలిసి కోరిక యొక్క స్వరూప స్వభావములను పరిశీలించబోతున్నాము. కోరిక అంటే యేమిటో చాల వివరంగా పరిశీలిస్తున్నామని మాత్రమే మీరు గుర్తుంచుకోండి. దాని స్వభావాన్ని మీరు తెలిసికొన్నట్లయితే ఇక దానిని అణచివేయడం, దానిని తప్పింపజూడడం లేదా దానిని సహేతుకముగా సమర్థించడమనే ప్రశ్నే లేదు. తెలిసిందా? ఇప్పుడు ప్రశ్న యేమనగా, కోరిక అంటే యేమిటి? పదము వేరు, దానిచే సూచింపబడు అర్థము వేరు, ప్రతిక్రియ వేరు. కోరిక అనే పదాన్ని మనము వాడుతున్నప్పుడు, ఆ పదము ప్రతిక్రియ కాదని, ఏదో అభావాన్ని అంటే లేకపోవడాన్ని సూచించేది కాదని మనం స్పష్టంగా గుర్తుపెట్టుకోవాలి.

ఈ దేశంనిండా అందమైన చెట్లున్నాయి, సుందరమైన మేఘాలున్నాయి, అద్భుతమైన పుష్పాలున్నాయి, ఉన్నతమైన ఓకు మ్రానులున్నాయి. కాని, జీవితంలో సౌందర్యమన్నది నామమాత్రము; మనకందమనేదే తెలియదు. చింతలతో, సమస్యలతో, ఆందోళనలతో మన మనస్సులు నిండివున్నాయి. సూర్యాస్తమయ సౌందర్యమును మన మెన్నడును కన్నులార చూడము. సాంధ్యరాగ సౌందర్యమునకు ఆనందించము. బాహ్య సౌందర్యమును ఆరాధించడమే కాదు మనము పోగొట్టుకొంటున్నది, ఆంతరిక సౌందర్యము గూడ మనలో చాలమందికి మృగ్యము. ఈ ఆంతరిక సౌందర్యము బాహ్యవస్తువుల మీద, చిత్రపటముల మీద, రాతి విగ్రహాల మీద మరి దేనిమీదనైనా ఆధారపడి లేదు. ఎంతో ప్రేమ, కరుణ ఉన్నప్పుడే ఆంతరిక సౌందర్యముంటుంది. అదీ అందమంటే. సత్యమంటే యేమిటో అది కూడ మనం విచారణ చేయవలసి వుంటుంది. ఆంతరిక సౌందర్యము యొక్క బలమే లేకపోతే సత్యమంటే యేమిటో మీకు తెలియనే తెలియదు; అది మీకు లభించదు.

ఇంతకు కోరిక అంటే యేమిటి? కోరిక మరియు దానిలో అంతర్భూతమైయుండే సంఘర్షణ – యీ రెండున్ను మనిషిని వదలక యెప్పుడును అతనిని అంటిపెట్టుకొని వుంటాయి. మనం కలిసి దీని స్వభావాన్ని పరీక్షిద్దాం, పరిశోధిద్దాం, తెలిసికొందాం. దేనినైనా చూడడంతో, జ్ఞానేంద్రియముల ద్వారా జ్ఞానము లభించడంతో కోరిక ఆరంభమవుతుంది. ఈ విషయమై మరి కొంత మెల్లగా, జాగ్రత్తగా ఆలోచిద్దాం. కన్నులతో చూడడం – నేత్రేంద్రియం ద్వారా జ్ఞానసంపాదన – చెట్లను, పూవులను, స్త్రీని, కారును చూడడం ప్రపంచాన్ని చూడడం – ఇదే కోరికకు ఆరంభము. అంటే కంటితో చూడడం, నాలుకతో రుచి చూడడం, ముక్కుతో వాసన చూడడం

– ఇవికదా  కోరికకు ఆరంభం? కాబట్టి మొదట చెట్టును, ఇంటిని, కారును, కాంతను, మనిషిని, అందమైన తోటను చూడడం, తరువాత దానిని తాకడం, దానితో సంపర్కమేర్పడడం పిదప సంవేదన కలగడమున్ను. అప్పుడు ఆలోచన ఆరంభమై అది మీరాతోటను, ఆ కారును, ఇంకా దానిని దీనిని కలిగియున్నట్లుగా ఒక ఊహాప్రతిమని (Image) మీలో కల్పిస్తుంది. సరేనా? అంటే, మొదట చూడడం, పిదప సంపర్కము – తాకడం, ఆ తరువాత సంవేదనము కల్గుతాయి. ఆలోచన ఊహాప్రతిమను సృష్టించడమే కోరికకు ఆరంభము. అర్థమైనదా? ఇది చాల సులభంగా అర్థమయ్యే విషయం. చూడడంతోబాటు దానితో సంపర్కము పిదప సంవేదనము – ఇది సహజము. అట్లే ఆ చొక్కా, ఆ నీలంరంగు చొక్కా లేదా ఫలానా విలువైన అంగీ మీకున్నట్లుగా ఒక ఊహాప్రతిమను ఆలోచన సృష్టిస్తుంది. ఆ సృష్టించిన క్షణమునందే కోరిక పుట్టుతుంది. దీనినంతను మీయంతట మీరే చూచుకోవచ్చును. మీరొక మంచి పంట్లాము చూస్తారు – చూడడం, అంగడిలోకి పోవడం, దానిని తాకడం, అప్పుడు మీవంటిమీద అది యెంత బాగా నప్పుతుందో, ఎంత అందంగా కనబడుతుందోయని ఆలోచన మీకు చెప్పడం – ఈ విధంగా మీ మనస్సులో ఊహాప్రతిమ రూపొందుతుంది. ఆ క్షణమునందే కోరిక ఉదయిస్తుంది, సరేనా? ఈ విధంగా ఆలోచన ఊహా ప్రతిమను సృష్టించడమే కోరికకు ఆరంభమని అర్థం చేసికోండి. మరి ఆ ప్రతిమకు నాశనమంటూ, ముగింపంటూ వుంటుందా?

ఎవడైనా మరి చూడడం, సంపర్కము సంవేదనము – ఈ తథ్యమును మాత్రం గ్రహించి, – ఆ పిదప ఆలోచన ఊహాప్రతిమను సృష్టించకుండా చేసికోగలడా? మీకిది అర్థమైనదా? ఆలోచన సంవేదనతో సంబంధం పెట్టుకొనినప్పుడు కోరిక మొదలవుతుందన్న యథార్థాన్ని అతడు గ్రహిస్తాడు. నిన్నటి ఆ సుఖానుభవము మస్తిష్కములో రికార్డవుతుంది – మెదడులో ముద్రింపబడుతుంది. "ఆ సుఖానుభూతి మరికొంత కావాలి" అని కోరిక అంటుంది. కోరిక యెట్లా ఆరంభమవుతుందో చూశారా? కోరికయొక్క స్వభావాన్ని యథార్థరూపంలో ఒక్కసారి గ్రహిస్తే, అప్పుడిక కోరికను అణచి వేసికోవడం, స్వాధీనంలో పెట్టుకోవడం, దానినింకో రూపంలోకి మార్చుకోవడం లాంటి ప్రశ్నలే ఉదయించవు. కోరిక అనేది యెట్లా పుట్టుతుందో అర్థం చేసికొని, ఆ క్షణంలో మీరు సావధానంగా, అప్రమత్తతతో వున్నట్లయితే, ఆలోచన ఊహాప్రతిమను సృష్టించే క్షణమునందు మీ మనస్సంతా, మీ ధ్యానమంతా దానిమీద వుండేటట్లయితే, అప్పుడు కోరికను అణచివేయడం, తప్పింపజూడడం, సమర్థించడం లాంటి ప్రశ్నలకు తావే వుండదు.

కోరిక అంటేనే సుఖము. అది విషయసుఖము. దానికి మనము బానిసలము. తనది అనుకొంటే సుఖము, అధికారముంటే సుఖము – గొప్ప రాజకీయవాదులకుండే అధికారం కాదది; మీ మీ భార్యలమీద, పిల్లలమీద మీకుండే అధికారమది. అది యొక విధమైన సుఖము. మానవుని విషయసుఖాన్వేషణకు అంతము లేదు. ఒకదానివలన మీకు సుఖం కలుగకపోతే మరియొక దానివెంట పోతారు. మీ మీ భార్యలతోగాని భర్తలతోగాని సుఖం లేకపోతే వాండ్లను మార్చివేస్తారు. ఇట్టి

అంతేగాని, ఆ సమస్యలను పరిష్కరించుకోవడానికి మనమెన్నడును ప్రయత్నించము. ఈ బాధ లనేక విధములు. మీరు ప్రేమించితిమని అనుకొన్న మనిషి చచ్చిపోవడం ఒక పెద్ద బాధ. అయితే, వున్న ఉద్యోగం పోవడం గూడ ఒక బాధే. భూమి, ఆకాశము, భౌతిక పదార్థము (Matter), సాంకేతికశాస్త్రము (Technology) – వీటన్నిటేని గురించి మానవు డెంతో జ్ఞానమును సంపాదించినాడు. అయినప్పటికిన్ని అతడు పేదరికముచే బాధపడుతూనే వున్నాడు, అన్యాయమునకు లొంగిపోతున్నాడు. తానింకా పరిపూర్ణత్వమును పొందలేదని, తనలో ఏదో యింకా కొరత వున్నదనే భావన అతనిని పీడిస్తూనే వున్నది. పరమాజ్ఞాన దశలో మునిగ తేలుతూనే వున్నాడు. ఈ విధంగా మనము బాధలతో సహజీవనం చేస్తున్నాము. బాధ మన జీవితంలో ఒక భాగమై పోయినది. ఈ బాధానుభవ మంతమవుతుందా యని మనమెన్నడును ప్రశ్నించము. ఈ బాధల నతిక్రమించడానికి పలువురు పలువిధములైన విధానాలు చెప్తారు – దేవుణ్ణి నమ్ముకో, నీ రక్షకునిమీద నమ్మకముంచు, బుద్ధుని విశ్వసించు, క్రీస్తును విశ్వసించు – ఇట్లా యేమేమో చెప్తారు. ఈ విధంగా మనము అంతులేని బాధలను భరించినాము. ఈ బాధలు అంతమవుతాయా; తాత్కాలికంగా కాదు, శాశ్వతంగా, సంపూర్ణంగా? అని మనమడుగుతున్నాము. బాధతోను, దుఃఖంతోను సతమతమవుతూ వున్న మనస్సు పూర్తిగా పరివర్తనము చెంది, క్రొత్తస్థితిలో క్రొంగ్రొత్త రీతిని పనిచేయ సాగుతుందా? బాధాతప్తమైన మనస్సు స్పష్టంగా ఆలోచించలేదు; బాధతప్తమైన మనస్సులో ప్రేమ ఉదయించదు. బాధాతప్తమైన మనస్సు ఏదో ఊహాలోకంలోనికి జారుకొంటుంది. బాధాతప్తమైన మనస్సు ఎవరితోను ఎట్టి సంబంధమును పెట్టుకొనదు. బాధానుభవము ఒంటరిపాటునకు దారి తీస్తుంది.

వ్యక్తిగత బాధానుభవమే కాదు, సమష్టి బాధానుభవమున్ను – అంటే, సర్వ మానవ జాతికి సంబంధించిన బాధానుభవమున్ను కలదు – యుద్ధానంతరము ప్రజలనుభవించే బాధలు, లక్షలాది ప్రజలు కన్నీళ్ళు కార్చడం, తల్లి బిడ్డను పోగొట్టుకొనడం మొదలైనవి. మనిషి తనలోని పెద్ద పెద్ద కోరికలను తీర్చుకోవాలనుకొని, చాల గొప్పవాడు కావాలనుకొని దానికి తగినంత శక్తి సామర్థ్యములు లేక బాధపడుతూ వుంటాడు. బాధకు పరిష్కారము ఓదార్పు అని తెలిసికొన్నాము. ఎవడైనా బాధపడేటప్పుడు ఓదార్పుకోసం ఎదురుచూస్తాడు, వెతుక్కొంటాడు. అతనికా ఓదార్పు వాస్తవ విషయాలలో దొరుకవచ్చు లేదా, కల్పిత భావనలలో దొరుకవచ్చు. ఇంతకును దుఃఖమునకు అంతమంటూ వుంటుందా యనేది మన ప్రశ్న. దుఃఖ మంతము కానిదే కరుణ కవకాశము లేదు. ఎవరైనా ఎందుకు బాధపడాలి? బాధ అంటే యేమిటో మీయందరికిని తెలుసు. కాని, ఇది యెందుకని మీరెప్పుడును అడుగలేదు. దాని గురించి మీరు స్వయంగా, ఎవరిమీదను ఆధారపడకుండా, అంటే – బుద్ధిని మీదగాని, అతడు చెప్పిన ఉపదేశాలమీదగాని, ఇతర దేశాలలో ఇతర మతనాయకులు చెప్పినదానిమీదగాని ఆధారపడకుండా, స్వయంగా విచారణ చేయలేదు. అదంతా అటుంచండి, వారు చెప్పింది సత్యమైనా కావచ్చు, అసత్యమైనా కావచ్చు. మానవులుగా బాధపడే మీరు ఆ సమస్యను పరిష్కరించుకోకపోతే, బాధానుభవమును అంతము

స్థితిచేసి మధ్యనుండే ఘర్షణ; రాజకీయాధికారాన్నిగాని, మతాధికారాన్నిగాని పట్టుకొని వదలకుండడం. అందువలన జీవించడమంటే యేమిటి? ఎడతెగని సంఘర్షణ, అందులో అప్పుడప్పుడు కొంత ఆనందము, విషయసుఖానుభవము, భయమున్ను. జీవితమంతా యింతే – దీనినెవరును కాదనలేరు. దీనిని తెలిసికోవడం కోసం ఏ మతగురువు వద్దకో, ఏ మనస్తత్త్వవేత్త వద్దకో, మరే గురువువద్దకో పోనక్కరలేదు. అదే మీ జీవితం – యాంత్రికము, చేసినదే చేయడం, ఏమాత్రము విలువలేని వాటిమీద నమ్మకముంచడం. ఇందులో ప్రధానవిషయ మేమంటే, మీరేమి చేస్తున్నారో ఎట్లా ఆచరిస్తున్నారో, ఎట్లా ప్రవర్తిస్తున్నారో అది ప్రధానం. దీనినే మనము జీవితమని పిలుస్తాము – భయాలు, ఆందోళనలు, అసూయలతో బాటు, మరొకరిమీద మమత్వము పెంచుకొంటూ జీవించడం. మమత్వమున్నచోట అవినీతి, భ్రష్టాచారము తప్పవు. మనిషి ప్రభుత్వాధికారాన్ని చేపట్టి, దానిమీద మమకారం పెంచుకొన్నట్లయితే అట్టివాడు అవినీతికి ఆటపట్టు. అతని ఉచ్ఛ్వాసనిశ్వాసాలలో అవినీతి నిండివుంటుంది. ఇదంతా మీ యెట్టయెదుట, మీ కండ్లముందర జరుగుతూ వుండడం మీరు చూడవచ్చు. ఇదీ మీ జీవితమంటే. దానిని పోగొట్టుకోడానికి మీరు భయపడతారు. అది పోవడమే మృత్యువు. సరేనా? దానిని మనము మృత్యువుగా భావిస్తాము. మీరు మీ ధనానికి, పదవికి కట్టుబడిపోయినారు, వాటిమీద మమకారం పెంచుకొన్నారు. స్వతహాగా మీలో ఏమీ లేదు, మీరు దేనికినీ చాలరు. ఇదంతా జీవితము; మీరు దీనిని పట్టుకొని వదలరు. ఇది జ్ఞాతము, అందరికినీ తెలిసిన విషయము. అజ్ఞాతమే మృత్యువు.

పునర్జన్మ వున్నదని యింకా ఏవేవో మీరు చెప్పవచ్చు. కాని, మీ అసలు జీవితమిది. జీవించి యుండగానే మమత్వమును, రాగబంధమును త్రెంచుకొనగలరా? ఈ మమకారము ఒక నమ్మకంతో, ఒక వ్యక్తితో, ఒక కుటుంబంతో, ఒక భావనతో ఒక విశిష్ట సంప్రదాయంతో పెంచుకొన్నట్టిది; దానిని స్వయంగా వదలుకొనగలరా? లేనిచో మృత్యువే మీచేత ఆ పనిని చేయిస్తుంది. మీరు ఒంటరిగాండ్లు. మీకు కొంత ఊరట, ఓదార్పు కావాలి; మీకు తోడు కావాలి, ఒంటరిగా నిలబడలేరు. అందువలన ఒక వ్యక్తితో గాఢమైన మమకారాన్ని పెంచుకొంటారు. అతనిమీద మీరు ఆధారపడతారు. అదే బంధమంటే. అట్టి బంధమున్నచోట అసూయ, ఆందోళన, భయము – వాటి ఫలితంగా అవినీతి, భ్రష్టాచారము తప్పవు. మృత్యువు అంటుంది గదా – "వాటినన్నింటిని వదిలెయ్యండి. మీరు మరణించబోతున్నారు, చావబోతున్నారు" అని. ఆ పనిని మీరు జీవించియుండగానే చేయగలరా? మీకు నా ప్రశ్న అర్థమౌతున్నదా? ఒకదాని ముగింపు మరొక సరిక్రొత్తదానికి ఆరంభము. పూర్తిగా మమకారబంధమును త్రెంచుకొనుటయే మృత్యువు. దానిని పూర్తిగా త్రెంచుకొన్నచో అప్పుడు మీ అస్తిత్వమునందు పూర్తిగా క్రొత్తమలుపు ఆరంభమవుతుంది. అట్టిచో మృత్యువంటే యేమిటి?

సంక్షోభము, దైన్యము, గందరగోళము, అంతులేని పోరాటము – వీటితో గూడిన జీవితమంటే యేమిటో మనం పరిశీలించినాము. ఇక మృత్యువంటే యేమిటి? వార్ధక్యమువలనగాని, వ్యాధిమూలముననగాని, ప్రమాదము చేతగాని,

దురుపయోగము చేసికొనుట వలనగాని, ఎట్టి సంయమము లేకుండా [illegible] ములలో మునిగిపోవడం వలనగాని ఉద్రేకము, ఆవేశము, ఆకలి మొదలైనవాటివల్ల గాని శరీరము క్రమముగా శుష్కించి శిథిలమవుతుంది - అదే [illegible] ఇది మనకు తెలుసును, మనం దీనిని చూస్తాము. కాని, మరణము లేనిది, శాశ్వతమైనది, ఆత్మ అని పిలువబడేది ఒకటున్నదనిగూడ మనమంటాము. ఈ విషయమై రకరకాలైన నమ్మకాలున్నాయి. అందులో నొకటి మీరు చనిపోతే, మరల జన్మ ఎత్తుతారనేది; దీనిని మీలో కొందరు చాల దృఢంగా నమ్ముతారు. దీనికి సంబంధించిన ధార్మిక భావనలను, ఇంకా రకరకాలైన అభిప్రాయాలను గూడ [illegible] నమ్ముతారు. నమ్ముతున్నామంటే అది మనస్సును అర్థం చేసికోవడం [illegible] మనస్సు వివిధములైన భ్రమలయందును భ్రాంతులయందును, మత [illegible] పిడివాదములందును, కర్మకాండలందును ప్రసరిస్తుంటుంది. అందువలన మీలో - అంటే మీలో, శాశ్వతమైన పదార్థమేమైనా ఉన్నదా? మీలో శాశ్వతమైనదే గనక వుండియున్నట్లయితే మీరు మరల జన్మించడానికి అవకాశమున్నది. పునర్జన్మను కేవలం గ్రుడ్డిగా నమ్మడంలో అర్థం లేదు. నిజంగా మీకు దానిలో నమ్మకముండేటట్లయితే, మీరిప్పుడు - ఈనాడు - చేసే ప్రతి పనికి ఎంతో ప్రాముఖ్యమున్నది.

కాబట్టి మీలో - "నేను శాశ్వత"మని చెప్పుకొనే మనస్సులో - నిజంగా ఏదైనా శాశ్వతమైనది వున్నదా? లేక ప్రతిదిన్నీ కదులుతూ, మారుతూ [illegible] వున్నదేగాని శాశ్వతమైనదేదీ లేదా? ఇతరులతో మీకు గల సంబంధము శాశ్వతమా? మీ దేవతలు శాశ్వతమా? - దేవతలంటే మీ మనస్సునకు ఊరట కలిగించేవి. నిత్య జీవితంలో మీరు చేసే తప్పుడు పనులనుండి తప్పించుకొని పోయి ఆశ్రయం పొందడం కోసం మీ ఆలోచనలు కల్పించిన అమూల్యములైన [illegible] కదా! మా ప్రశ్న యేమంటే, మీ జీవితంలో శాశ్వతమైన దేదైనా వున్నదా? ఈ మీ యిల్లైన యీ భూమి శాశ్వతము; సముద్రము, నదులు, కొండలు శాశ్వతము. ఇవికాకుండా మీ జీవితంలో శాశ్వతమైనది, చిరస్థాయి యైనది, కలకాలము నిలిచి వుండేది యేదైనా వున్నదా? 'నేను' అని అనుకొనే అహంకార భావన [illegible] కల్పితము. నామము, రూపము, విశేష లక్షణాలు, సామర్థ్యములు, [illegible] విద్యలు - ఇటువంటివన్నీ మీ సంస్కృతియొక్క ఫలితము. ఇందులో శాశ్వతమైన దేదైనా వున్నదా?

మీరు శాశ్వతం కాదు; మీ ఆలోచనలు శాశ్వతం కాదు - అవి నిరంతరము మారిపోతూ వుంటాయి. మీ నమ్మకాలలో మీకు ఊరట లభిస్తుంటుంది గనుక వాటిల్లో భద్రత వున్నదని తలుస్తారు. నమ్మకమనేది కేవలం ఒక మాట, ఒక తలంపు, ఒక ఊహ. రక్షణకోసం దానిని మీరు ఆశ్రయిస్తారు! అది రక్షణ నిచ్చేది కాదు. ఆ రక్షణ ఒక విధమైన భ్రాంతి. కాబట్టి శాశ్వతమైనదంటూ మనలో ఏదీ లేదు. అట్లాగని గ్రహించడం మనసును చాల క్షోభపెడుతుంది, ఎంతో నిరాశతో గూడిన వ్యాకులపాటును కలిగిస్తుంది. కాని, నిజానికి అది అట్టిది కాదు. ఏది శాశ్వతమైనది కాదనే యథార్థాన్ని మీరు గ్రహించినప్పుడు ఆ గ్రహించడమే [illegible]

– అదే కొలది యిడరాని 'తెలివి.' ఆ తెలివిలో సంపూర్ణ రక్షణ యున్నది. ఆ తెలివి – మీదీ కాదు, నాదీ కాదు. అది 'ప్రజ్ఞానము' – లేదా పరాప్రజ్ఞ – అంతే. మమకారమున్నంతవరకు అవినీతి, భ్రష్టాచారము తప్పవు. ఇందలి సత్యమును సద్యఃకాలంలో గ్రహించడం, సద్యఃకాలంలో మమకారం అంతమవడమున్ను 'తెలివి.'

ఇందలి సత్యమును గ్రహించడంతోనే ఆ మమకారబంధమున్ను అంతమవుతుంది. అదే ప్రజ్ఞానము, 'తెలివి.' ~~ఈ~~ ప్రజ్ఞాన మొకరి సొత్తుకాదు, అది అదే. దానికి అవధులు లేవు; అది అనంతము, అపారము. మనమింతకుముందు చెప్పుకొన్నట్లుగా, బాధానుభవమున్నచోట కరుణ యుండదు. కరుణ యున్నచో అదే ప్రజ్ఞానము, తెలివి... దానినే పరాప్రజ్ఞ అని అనవచ్చును.

*కొలంబో,*
*15-11-1980.*

★ ★ ★

# 4. మనస్సుయొక్క విస్తృతి

## (The Magnitude of the Mind)

ఇది మన ఆఖరి సమావేశము. ఇంతకుముందు మన మిక్కడ మూడు పర్యాయములు సమావేశమైనప్పుడు మానవుని జీవితము, మానవుని అస్తిత్వము, పరస్పర సంబంధము, విషయ సుఖము, దుఃఖాంత మనే విషయాలను గూర్చి కలిసి మాట్లాడుకొని యుంటిమి. పరస్పర సంబంధమును గూర్చి, దేనినీ గ్రుడ్డిగా అంగీకరించకుండా, ప్రతిదానిని శంకించవలసిన అవసరాన్ని గూర్చి, ప్రతిదానిని ప్రశ్నించవలసిన అవసరాన్ని గూర్చి కూడా మాట్లాడుకొని యుంటిమి. ఈ సాయంకాలం మనస్సు యొక్క విస్తృతిని గూర్చి, దాని కతీతంగా ఏమైనా ఉన్నదా, లేదా, లేక బాహ్యప్రపంచంలోగాని, అంతరిక ప్రపంచంలోగాని అన్నీ ఆలోచనచేత సృష్టింపబడిన విషయాలేనా అనేదాని గురించిన్నీ పరిశీలిద్దాం.

వైద్య – వైజ్ఞానిక – సాంకేతిక ప్రయోజనముల కొఱకై ఆలోచన ఒక సాధనముగా ఉపయోగించుకొనబడినది. విశ్వాంతరాళమునందు శుక్ర శని గ్రహముల పర్యంతము ఆలోచన అన్వేషణను కొనసాగించినది. మానవుడు చంద్రోపరితలముపై కాలుమోపి, అక్కడ తన పతాక నెగురవేసినాడు. మానవుడు ఆకాశము లోపలికి, భూమి లోపలికి, సముద్రము లోపలికి చొచ్చుకొని పోగలిగినాడు. మానవుడు తన అపరిమిత సామర్థ్యము నుపయోగించి బాహ్యప్రపంచమును స్వాధీనము చేసికొన్నాడు; అతనికి అంతరిక్షము వశమైనది, ప్రకృతియు పరిసరములును వశమైనవి. సాంకేతిక విద్యాప్రపంచములో అతనికి గల సామర్థ్యము అసాధారణమైనది. కాని, అతడు తన మనస్సు యొక్క లోతులలోనికి గాని, దాని విస్తృత పరిమాణములోనికి గాని పోయి పరిశీలించ లేదు; తన ప్రస్తుత చేతన (Conscience)కు పరంగా ఏమున్నదో మానవు డెన్నడును ప్రశ్నించి యుండలేదు. ఎంత బ్రహ్మాండమైన శక్తి మన మనస్సులో నిద్రాణమై యున్నదో మన మింకను తెలిసికొనలేకున్నాము. మనస్సంటే మన వుద్దేశం మెదడు పని చేయడము, దానికి గల శక్తి సామర్థ్యములే కాదు; మనకు వచ్చే భావోద్రేకములు, ఇంద్రియముల యొక్క ప్రతిస్పందన ద్వారా లభించెడి జ్ఞానము, అనురాగము, మానవ సహజమైన ప్రతిస్పందనలు, ప్రతిక్రియలు మొదలగున వన్నియు గ్రహింపబడును. మెదడుకుగల శక్తి అపారము; అది గ్రహింపగలదు, గ్రహించినదానిని మరచిపో గలదు; జ్ఞానమును తనలో నిలువజేసికొన గలదు, నిలువజేసికొన్న జ్ఞానము ననుసరించి నేర్పుగానో లేక అది లేకుండానో పని చేయగలదు.

ఈ సాయంకాలం మనం మనస్సు యొక్క విస్తృతి యెంతో, దాని పరిమాణ మెంతో తెలిసికొనడానికి ప్రయత్నిద్దాం. ఇది చాల పెద్ద ప్రశ్న. మనస్సు యొక్క

అపరిమేయతత్వాన్ని దాని సామర్థ్యాన్ని చాల లోతుగా పరిశీలించి చూడవలెనంటే, దానిని గురించి విచారణ చేయవలెనంటే మనస్సులో పరిపూర్ణమగు నిశ్శబ్దముండాలి – ఈ విషయాన్ని ముందు మనం స్పష్టం చేసికోవాలి. ఈ నిశ్శబ్దము ఆలోచన చేత సాధించబడేది కాదు! దేనికో ఫలితముగా గాని, శిక్షగా గాని వచ్చేది కాదు. ఈ నిశ్శబ్దానికి ఉద్దేశముగాని హేతువుగాని లేదు. ఈ నిశ్శబ్దం అనేక విధాలు: రెండు సంభాషణల మధ్యగల నిశ్శబ్దము, రెండు ధ్వనుల మధ్యగల నిశ్శబ్దము, పాడుతూ ఆడుతూ మరల పాడుతూ వుండే రెండు పక్షుల మధ్యగల నిశ్శబ్దము, పూర్తిగా ప్రశాంతంగా వుండే సముద్రము యొక్క నిశ్శబ్దము, రాబోయే అద్భుతమైన రాత్రిని సూచిస్తూ సూర్యు డస్తమించే వేళ యందలి సంధ్యాకాల నిశ్శబ్దము. మాటల కందనిది, మతమునకు సంబంధించనిదైన యిట్టి నిశ్శబ్దము కొఱకై మానవు డన్వేషించినాడు. ఎన్నో శతాబ్దాల ప్రచారము ద్వారా మానవుడు నిశ్శబ్దాన్ని వివరించి చెప్పడానికి, దానికి యుక్తి యుక్తమగు అర్థాన్ని తెల్పడానికి ప్రయత్నించినాడు. ఈ ప్రచారాన్ని క్రైస్తవులు చేసినారు, బౌద్ధులు చేసినారు; హిందువులు, మహమ్మదీయులు, ఇంకా ఇతరులు కూడ చేసినారు. వారందరు మానవునిలో గ్రుడ్డి నమ్మకాన్ని పుట్టించినారు, మతపరమైన మూసలో పోసి దించినారు. అతడెంక ఆ మూసను విడిచి బయటపడడం దాదాపు అసాధ్యము – ఆ సంస్కారపు ముద్రను తొలగించుకొని బయటికి రావడం దాదాపు అసంభవం. అందువలన మానవుడు తన మనస్సుపై పడిన ఆ సంస్కారముద్రనే వీలున్నంతవరకు ఉపయోగించుకొని, ఆ చెరసాలలో నుండి వింత వింత ఊహాలోకములలోనికి, భావనా ప్రపంచంలోనికి, సిద్ధాంత రాద్ధాంతములలోనికి, వైపరీత్యాన్వేషణ మొదలగువానిలోనికి పారిపోజూస్తాడు.

నేడు మతమంటే అదియొక నోటిమాట, ఒక నినాదము. "నేను బౌద్ధుణ్ణి" అని, "నేను క్రైస్తవుణ్ణి" అని, ఆ క్రైస్తవ ప్రపంచంలో కూడ ఫలానా తెగకు చెందిన వాడనని, హిందూమతంలోని వేలకొలది దేవతలను, ముస్లిం ప్రపంచంలోని దేవుణ్ణి మాటిమాటికి చెప్పుకొనడమే నేడు మతమంటే. ఈ యన్నిటితో మన మెదడు నిండిపోయి వున్నది. అందువలన సత్యాన్వేషణ చేయువాడు వ్యవస్థీకృతమైన యే మతానికి గాని, యే నమ్మకానికిగాని, వేర్వేరు తెగలకు చెందిన దేవుళ్ళకుగాని లేదా ఒకే దేవునికిగాని చెందడనుట స్పష్టం. అట్టివాడు మత సంబంధమైన కర్మకాండలనుండి, మత విశ్వాసములనుండి, ఊహాప్రతిమలనుండి, మతగురువుల పెత్తనం నుండి – యింకా ఇతరములైన వాటినుండి విముక్తుడై యుండాలి. మనస్సు – మీ మనస్సు – ఆ విధంగా విముక్తమై యుండగలదా? ఉండలేదు. ఎందువల్లనంటే, అది తన లోపలి పొరల అడుగున ఎక్కడనో లోతుగా తనకు రక్షణ కావాలని కోరుకొంటూనే వుంటుంది – శారీరక రక్షణనే కాదు, ఆంతరిక రక్షణను గూడ కోరుకొంటూ వుంటుంది. ఆలోచన ఎల్లప్పుడును ఏదో యొక విధమైన ఆశ్వాసనముకోసం, ఓదార్పుకోసం, ఏ మైనలోటం, శాశ్వతత్వం కోసం ప్రయత్నిస్తూ వుంటుంది. ఆ ప్రయత్నములో, ఆ అన్వేషణలో అది ప్రపంచమంతా వ్యాపించియున్న మతగురువుల వల్లలో, వారి సిద్ధాంతాలు – వారి కర్మకాండలు మొదలగువాటి వలలో చిక్కుకొంటుంది. మీ మనస్సు వాటి అన్నిటినుండి విముక్తము కాగలదా? విముక్తము కాకపోతే మీరు

కారాగారములో చిక్కుకొన్న ఖైదీలతో సమానము; మీరు నడుస్తున్న యంత్రముల వంటి వారగుదురే కాని, నిజమైన మానవు లనిపించుకోరు.

కంప్యూటరు మాదిరిగా మనము మానవులము కూడ ఎల్లప్పుడును ఒక తెలిసిన విషయమునుండి మరియొక తెలిసిన విషయమునకు పయనిస్తూ, ఆ తెలిసిన విషయము పైననే ఆధారపడి పని చేసికొంటూ వుంటాము. మన మనస్సులు యాంత్రికములై పోయినవి. మీరు ఇంజనీరింగు చదువు చదివినట్లయితే ఇక మీ మిగిలిన జీవితమంతా ఇంజనీర్లుగానే ఆలోచిస్తూ వుంటారు – వంతెనలు ఎట్లా కట్టాలి, రైలుదారు లెట్లా వెయ్యాలి, భవనము లెట్లా నిర్మించాలి, విమానము లెట్లా తయారు చెయ్యాలి – ఈ విధంగానే మీ ఆలోచనలన్నీ సాగుతూ వుంటాయి. లేక, మీరు శస్త్రవైద్యు లైనట్లయితే పదేండ్లపాటు వైద్యం చదివి, ఆ తరువాత శస్త్రచికిత్స చేయడం నేర్చుకొని, పిదప మీ శేష జీవితమంతా శస్త్రవైద్యులుగానే గడిపివేస్తారు. లేకపోతే రకరకాలైన మత శాఖల రకరకాల గ్రంథాలను సంవత్సరాల తరబడి చదివి, అందులో ప్రవీణులై, బాగా వాదింపగల సమర్థులౌతారు. కాని అదంతా ఒక తెలిసిన విషయము నుండి మరియొక తెలిసిన విషయము లోనికి పయనించడమే. మన దైనిక జీవితము గూడ యాంత్రికమే! ప్రొద్దున 9 గంటలకు ఆఫీసుకుపోయి, సాయంత్రం 5 గంటలకు తిరిగివస్తారు. ఇదే పద్ధతిన జీవితమంతా గడుస్తుంది. ప్రతి దినము ఇంటికి తిరిగి రావడం, కామవాంఛ, కలహములు, పెద్ద పెద్ద ఆశలు, గొంతెమ్మకోరికలు, లేనిపోని గర్వము, మూఢనమ్మకము – ఇంకా ఎన్నెన్నో. ఇదీ మన జీవితం, ఇదీ మన మెదడు. మన మనస్సు దీనికి నిబద్ధమై పోయినది. ఇట్లా నిబద్ధమై పోవడం చేత, అందులో గల విపత్తును మనము గమనించడం లేదు.

ప్రపంచము సాంకేతికంగా (technologically) చాల త్వరగా మారిపోతూ వున్నది. కాని నైతికంగాను, భౌతికంగాను మనలో మార్పు లేదు; బహుశా యే కొంచెమో మెరుగై యుండవచ్చు, ఏ కొంచెమో నాజూకుతనం నాగరికత వచ్చి వుండవచ్చు, అంతమాత్రమే. మన మెంతగానో సంప్రదాయ బద్ధులము. మనకు దేవుని మీద నమ్మకం వుండవచ్చు, వుండక పోవచ్చు; మతముల ప్రభావము మన జీవితముల మీద అత్యధికము. ఐరోపాలో మత యుద్ధములు జరిగినవి; దేవుని పేరిట – లేదా మరొకదాని పేరిట – విచారణ జరపడం, నానాయాతన పెట్టడమున్ను. బహుశా బౌద్ధమతంలోను, హిందూమతంలోను మాత్రమే చంపడానికి ప్రోత్సాహ మివ్వరు. అయినా, ఈ దేశంలో (శ్రీలంకలో) మాంసం తింటూనే, మేము బౌద్ధులమని చెప్పుకొంటారట! "చంపవ"ద్దని బుద్ధుడు చెప్పినాడని అంటారు. కాబట్టి మతమంతా వట్టి మోసము, వట్టి నటన – అందులో వాస్తవికత లేదు, సారము లేదు. అది కేవలం మాటల పోగు, అధికారం చెలాయిండమున్ను. దానితో మన నిత్య జీవితానికి ఎట్టి సంబంధము లేదు. ఇవి వాస్తవ విషయాలు; ఈ వక్త కల్పించినవి కావు.

"మేము బౌద్ధుల"మని చెప్పుకొనే ముందు మీరు మీ జీవితం వంక ఒకసారి చూచుకోండి. మీరు బౌద్ధులు కారు; బౌద్ధులమని పేరు మాత్రం తగిలించుకొన్నారు. తక్కిన ప్రపంచ మానవులవలె మీరును మానవులే. మీకును అందరి మాదిరే

శరీర క్లేశము, యాతన, కలవర పాటు, దైన్యము, దుఃఖము, బాధ – ఇటువంటి వన్నీ కలవు. కాబట్టి మానసికంగా మీరే ప్రపంచము, ప్రపంచమే మీరు; మీకును ప్రపంచానికిని భేదము లేదు. ఈ యథార్థాన్ని మీరు గుర్తించినట్లయితే మీలో ఆశ్చర్యకరమైన మార్పు వచ్చి – మీరేమి ఆలోచించినా, ఏమి చేసినా, ఎట్లా ప్రవర్తించినా దానికి మీరు బాధ్యత వహిస్తారు. మన మనస్సులే మనము, మన చేతనయే మనము. భయము, బాధ, విషయ సుఖము, విశ్వాసము మొదలగునవన్నీ కలిస్తే అదే చేతన అవుతుంది. మన మెవరమంటే, మన చేతన, అందులో వుండే విషయములున్ను. ఈ చేతనా విషయమును శాంతపరచడమే ధ్యానము. చేతన నుండి అందలి విషయమంతను తొలగించడమే ధ్యానము.

ధ్యానమనగా ఆలోచించడం, తలపోసికొనడం. ధ్యానమంటే యేమిటో మన మనస్సు విచారణ చేస్తూ వున్నది. అంతేగాని, ధ్యానమెట్లా చేయవలెననేది కాదు. ధ్యానమెట్లా చేయవలెననేదానికంటె, ధ్యానమంటే యేమిటో తెలిసికోవడం చాల అవసరము. టిబెట్టు దేశీయుల ధ్యానపద్ధతి, బౌద్ధులది, హిందువులది, చైనావారిది, జెన్ పద్ధతి – ఇట్లా ధ్యానపద్ధతు లెన్నో వున్నాయి. ఇందులో ఒక్కొక్కరిది ఒక్కొక్క పద్ధతి. దేనికి దానికి వేర్వేరు అభ్యాసములు, వేర్వేరు సాధనలున్నాయి – గాలి పీల్చడం, పీల్చకపోవడం, ఏదో యొక ఆసనంలో కూర్చోవడం – ఇవన్నీ ధ్యానమెట్లా వుండవలెనో దాని గురించి ఆలోచన కల్పించిన విషయాలు. మన మిప్పుడు నిజమైన మతమనగా నేమో ధార్మికమైన మనస్సనగా నేమో అనే విషయాలే గాకుండా, ధ్యానమనగా నేమి అనే విషయాన్ని గూడ విచారణ చేస్తున్నాము. జెన్ ధ్యానము, హిందువుల ధ్యానము, బౌద్ధుల ధ్యానము – ఇంకా ఇటువంటివన్నీ గురువులు కల్పించినవి, సాంప్రదాయిక రీతిని వారిచే వివరింపబడినవి. అవన్నీ నియంత్రణము, క్రమశిక్షణ, అభ్యాసముల మీద ఆధారపడినవి. ఈ వక్త దృష్టిలో ఇదేదియు ధ్యానము కాదు. దినమున కిరువది నిమిషాలు ధ్యానము చేసి, మిగిలిన దినమంతా మీరు చేయదలచుకొన్న దుర్మార్గమంతా చేయడం ధ్యాన మనిపించుకోదు. క్రొత్తపద్ధతి ప్రకారం ధ్యానము చేసే గుంపులో మీరు చేరియుండ వచ్చును. ముఖ్యంగా ఇటీవల ధ్యానముపేరిట ఏమేమో విషయాలు జరుగుతున్నాయి. భారతదేశపు గురువులు ఈ పిచ్చిని ఐరోపాకు తరలించి, అక్కడ దీనిని అభ్యాసం చేస్తున్నారు, చేయిస్తున్నారు – మరి, అదెందుకో దేవుడికే తెలియాలి – బహుశా ఇంకా ఎక్కువ డబ్బు సంపాదించడానికో, ఇంకా ఎక్కువ ఆరోగ్యం పొందడానికో లేక, ఇంకా ఎక్కువగా జ్ఞాపకశక్తిని పెంపొందించుకోడానికో, మరింకా దేనికో!

దయచేసి మీరంతా ధ్యానమంటే యేమిటో, నిజమైన మతమన నేదో విని, విచారణ చేసి, తెలిసికోదలచుకొంటే, ఈ వక్త తరచుగా చెప్పే కథ నొకదానిని జ్ఞాపకం పెట్టుకోండి: ఇద్దరు మనుషులు చెట్లూ చేమలూ, వాటి నీడలు, బాగా కట్టబడిన గోడలు ఇంకా ఏవేవో చూస్తూ రోడ్డు వెంబడి పోతూ వుండినారు. ఇంతలో వారిద్దరిలో నొకరికి దారిలో ఏదో కనబడుతుంది. దాని నతడు చేతులోకి తీసికొని, దానివైపు చూడగానే అతని ముఖము కాంతిమంతమై వెలుగుతుంది. అద్భుతమైన సౌందర్యము, ప్రసన్నత, ఒక విధమైన ఠీవి ఆ ముఖంలో కన్పిస్తాయి.

భగవంతుని ఆశీస్సును పొందినట్లు తోస్తుంది. అప్పు డతని స్నేహితుడు, "ఏమైంది నీకు? నీకు దొరికిన దేమిటి?" అని అడిగినాడు. అప్పుడు మొదటివాడు, "అది సత్యమనుకొంటాను, కనీసం అందులో నొక భాగమైనా అయివుంటుంది. దానిని నా దగ్గరే పెట్టుకొంటాను" - అని అంటూ అతడు దానిని తన జేబులో పెట్టేసి కొన్నాడు. అప్పు డతని స్నేహితుడు, "నీకు నేను సహాయపడగల ననుకొంటాను; దానికోసం మన మొక సంస్థను స్థాపిద్దా"మని అన్నాడు. దీనిలోని భావము మీ కర్థమైనదా? ధార్మికమైన మనస్సంటే యేమిటో, దాని లోతుపాతులను గూర్చి విచారణ చేసే మనిషికి ఏ వర్గంతోను, ఏ సంస్థతోను, మత సంస్థ అనబడే దేనితోను సంబంధముండరాదు. మీరు వాటి నన్నిటిని ఇప్పుడు విడిచిపెట్ట గలరా? ఆ పని రేపటికి వాయిదా వేయవద్దు; దాని గురించి ఆలోచిస్తాలే అనవద్దు. అట్లా అనేటట్లయితే, అసలది జరిగేపని కాదు.

అయ్యా, 'లోవెలుగు'నకు (Enlightenment) కాలముతో సంబంధము లేదు. ఎన్నో యేండ్ల పాటు అభ్యాసం చేస్తే, ఎన్నో యేండ్లపాటు సన్యాసియై తిరిగితే, ఎన్నో యేండ్లపాటు తపస్సు చేస్తే వచ్చేది కాదు ఆ వెలుగు. ధార్మికమైన మనస్సులో కాలమునకు చోటు లేదు. "ఆ స్వర్గసుఖమును పొందడానికి, స్వర్గమందలి అమృతాన్ని త్రాగడానికి నాకు కొంత టైమివ్వండి, కొంత వ్యవధి యివ్వండి"- అని ప్రపంచంలోని ప్రతివాడును అంటాడు. కాని, దర్శనమే ఆచరణమని మేమంటాము. అంటే దర్శించడం, ఆచరించడం రెండును వెంటనే, సద్యః కాలమున, జరుగునవి. ఈ వాక్యాన్ని వివరిస్తాను: "మమకారము అవినీతికి దారితీస్తుంది" అని ఒకరన్నా రనుకోండి. అది యీ వక్త చెప్పిన వాక్యమే. మీరు దానిని వింటారు. మీకు మమకారమున్నది. అప్పుడు మీరు, "నిజమే కాని, అది (మమకారము) అవసర"మని అంటారు. మీరు ఒంటరివారు, ఒంటరితనం అనుభవిస్తున్నారు; మీకు ఆశ్వాసనం, ఓదార్పు కావాలి, సుఖం కావాలి. అందుకని మమకారం పెంచుకొన్నారు. కాని, పై వాక్యాన్ని మీరు విన్నప్పుడు, మీరు గనక సూక్ష్మగ్రాహు లైనట్లైతే, అప్రమత్తులై జాగరూకతతో గమనించే వారైనట్లైతే, సత్యమును దర్శించిన క్షణమునందే ఆచరణ మొంటున్నది అంటే, వెంటనే మమకారమును వదిలి పెట్టెదరు. అదే తెలివి. అంతేగాని, గడసరిదైన మనస్సు రకరకాలైన అభిప్రాయాలను సిద్ధాంతాలను మీ ముందుంచి, వాదించి, మీ మార్గాన్ని నిర్దేశిస్తూ వుంటే, అది తెలివి అనిపించుకోదు. తెలివి అంటే చూచి గ్రహించడం. ఉదాహరణకు, 'ప్రపంచంలో జాతీయతాభావము విషతుల్యము' - ఈ వాక్యమందలి సత్యమును చూచి గ్రహించగానే జాతీయతాభావము నుండి విముక్తమగుటయే తెలివి. ఆచరణలో గల అట్టి స్వతంత్రమే తెలివి. ఆ తెలివి మీదీ కాదు, నాదీ కాదు. ఆచరణ రూపంలోనున్న సత్యానిది ఆ తెలివి; ఆచరణగా మారుతున్న సత్యానిది ఆ తెలివి.

కాబట్టి, అన్ని కొలతలనుండి విముక్తి పొందడమే ధ్యానము. మన మనస్సు లెల్లప్పుడును కొలుస్తూ వుంటాయి: ఎక్కువ తక్కువ, ఎక్కువ అధికారం గలవాడు, తక్కువ అధికారం గలవాడు, లోభి, తక్కువ లోభి. ధ్యానము కూడ కొలతయే. పోల్చడము, అనుకరించడము, అనుగుణముగా ప్రవర్తించడము (ఉపమానము,

అనుకరణము, అనువర్తనము) – ఈ విధమైన కొలమానము లేకుండా, మనస్సు విముక్తమై యుండగలదా? కొలమానము లేకుండా సాంకేతిక ప్రపంచమునకు అస్తిత్వమే లేదు. పాశ్చాత్య దేశము లన్నియు ప్రాచీన కాలమందలి యవనుల (గ్రీకుల) బుద్ధిసంపదచే ప్రభావితమైనవి. వారికి విచారణ చేయడానికి, పరిశోధన చేయడానికి కొలవడ మొక్కటే సాధనము. మీ మనస్సు లిప్పుడు కొలమానమునుండి – అంటే ఎక్కువ, తక్కువ తప్పకుండా ఉండాలి, తప్పకుండా ఉండగూడదు – ఈ విధమైన కొలమానము నుండి విముక్తములు కాగలవా? కాగలిగినచో, కొలమానముగా నుండెడి ఆలోచనా ప్రవాహ మాగిపోగలదు. మనోవ్యాపారములగు వినడం, చూడడం, గ్రహించడములను పూర్తిగా వినియోగించి చూస్తే, మీ జీవితము కొలమానం మీద ఆధారపడి యున్నదని తెలుస్తుంది. పెద్ద పెద్ద ఆశలు పెట్టుకోవడమంటే అది కొలవడమే. అనురాగము లేక వాత్సల్యము కొలమానంగా మారిపోయినది. ప్రేమకు కొలత లేదు. కాని, ప్రేమంటే యేమిటో మనకు తెలియదు. మనకు తెలిసినవి విషయసుఖము, కోరిక. కాని కోరికయు, విషయసుఖమున్ను ప్రేమ కావు. ఇప్పుడు మీరీ వాక్యమును విని, యెదురుతిరిగి ప్రశ్నిస్తారు. మీరు విషయసుఖం మీద, కోరికమీద ఆధారపడి జీవిస్తున్నారు. కామవాసనకు సంబంధించిన బొమ్మలు మీలో వున్నాయి, మీరా కామవాసనను వదులుకోలేరు. అందుచేత, "ఇది ఇట్లానా? ఎట్లా దానిని వదులుకోగలం?" అని మీరంటారు. దాని భావ మేమంటే మీరు నిజంగా వినడం లేదని. వదులుకోడానికి మీ రంగీకరించరు. వదులుకోకుండా ఉండడానికి కారణాలు వెదకడం మొదలు పెట్టుతారు. ఈ ప్రక్రియలో క్రమంగా వినడమే మానివేస్తారు.

ధ్యానమంటే కొలమానం లేని కదలిక యని యీ వక్త అంటున్నాడు. ఇందులోని అందాన్ని మీరు అవగాహన చేసికొన్నారా? మనస్సులోని నిశ్శబ్దత కొలత కందనిది. ఆలోచనా రూపమైన కదలిక యేమాత్రమున్నూ లేకుండా మనస్సు సంపూర్తిగా శాంతిస్తే, అప్పుడు కొలత కందనిదేదో అది సాక్షాత్కరిస్తుంది. అది మీరు మీ చేతనావిషయమును (content of the consciousness) అర్థం చేసికొన్నప్పుడు మాత్రమే లభిస్తుంది.

మనలోకి మనము లోతుగా పోయి, అందలి విషయములను ఒకే చూపులో – చిన్న చిన్న భాగములలో గాకుండా, అంతను ఒకేసారి – చూడగలమా? అట్లు చూడవలెనంటే అవధానత (attention) కావాలి. అవధానత అంటే యేమిటో మీరు తెలిసికొనగోరుతారు; వక్త దానిని వివరించవలసి యున్నది. కాని, మీ మనస్సులు హెచ్చరిక గలిగి, అప్రమత్తంగా వుంటే అవధానత అంటే యేమిటో వెంటనే అర్థమవుతుంది. అవధానతను మీరు కృషిచేసి పెంపొందించుకొనలేరు. ఏకాగ్రత (Concentration)ను కృషిచేసి పెంపొందించుకొనగలరు. ఏకాగ్రత అంటే ఆలోచనా శక్తిని ఒకానొక బిందువు మీద, లేదా ఒకానొక విషయం మీద కేంద్రీకరింప జేయడం. అట్లు ఒకేదానిమీద కేంద్రీకరించునపుడు బయటినుండి వచ్చెడి అటంకములను, విక్షేపములను అన్నిటిని నిరోధించవలసి యుంటుంది. ఇతర దిశలకు పోకుండా ఆలోచనా శక్తిని నిరోధించి, కోరిన మార్గమున పోనీయవలసి యుంటుంది. దానినే

మామూలుగా ఏకాగ్రత అని యంటాము. అందువలన అవధానతకును ఏకాగ్రతకును మధ్యగల వ్యత్యాసము మీకు అర్థమైనదా?

మన మనస్సులు ఏకాగ్రతను సాధించడంలో శిక్షణను పొందివున్నాయి. దానివలన లాభమున్నంతవరకు లేదా బాధలనుండి తప్పించుకోవడానికి ఉపయోగపడునంతవరకు మనము మనస్సులను ఏకాగ్రము చేస్తూ వుంటాము. అంటే, ఒకే విషయం మీద ఆలోచనను కేంద్రీకరింప జేసేటప్పుడు, తక్కిన ఆలోచనలను అడ్డగించవలసి యుంటుంది. కాని, అవి మరల మరల వస్తూనే వుంటాయి. ఒకే విషయం మీద ఆలోచనను ఏకాగ్రము చేయవలెనని మనం ప్రయత్నిస్తూ వుంటే ఆ యాలోచన తప్పించుకొని ఇతర దిక్కులకు పోతూ వుంటుంది. అందుచేత దానిని మళ్ళీ మళ్ళీ వెనుకకు లాగవలసి వస్తుంటుంది. కాబట్టి అదియొక నిరంతర సంఘర్షణ. ఇందులో నిరోధించునది (నిరోధకము – controller), నిరోధించబడునది (నిరుద్ధము – controlled) అని రెండు ఉంటాయి. ఆలోచనకు అవధానత అవసరమని, ఏకాగ్రత సాధించాలని, ఇది చేయాలని, అది చేయరాదని – ఇట్లా నిరోధకము చెప్పుతూ వుంటుంది. ఈ విధంగా నిరోధక నిరుద్ధముల మధ్య విభేదముంటుంది. కాని, నిరోధక నిరుద్ధములు రెండును ఒకటే, ఆ రెండింటి మధ్యను భేదము లేదనే పరమసత్యాన్ని మీరు చూచి గ్రహించినట్లయితే, కేవలం మాటల ద్వారా కాకుండా, సిద్ధాంత రీత్యా కాకుండా, వాస్తవంగా అర్థం చేసికొన్నట్లయితే, వెంటనే సంఘర్షణ పూర్తిగా ఆగిపోవడం గమనిస్తారు. ఒకే ఆలోచన, తన్నుదాను, నిరోధకము – నిరుద్ధములని రెండు భాగాలుగా విభజించుకొంటుంది. కాని, అదంతా ఒకే ఆలోచన కదా? ఈ విషయాన్ని స్పష్టంగా తెలిసికోవాలి. ఒకనికి కోపం వస్తుంది; అప్పుడు ఆలోచన అంటుంది: "కోపాన్ని అణచుకో, కోపపడవద్దు" అని. ఆ కోపము ఆలోచనకంటే భిన్నమా? మీరే కోపము. మీరు కోపంకంటే భిన్నం కాదు. ఇది స్పష్టమే కదా?

కాబట్టి, నిరోధకమును ఆలోచన కల్పించినది. నిరుద్ధమగుదానికంటె నిరోధకము గొప్పదనే సంప్రదాయమును గూడ ఆలోచనయే కల్పించినది. నిరుద్ధమగు ఆలోచనకంటె నిరోధించునట్టి తాను వేరనే భావమును అదియే కల్పించినది. మీరు దానిని జాగ్రత్తగా గమనిస్తే, నిరోధించునదే (అంటే నిరోధకమే) నిరుద్ధమగునది. ఆలోచన అన్నిదిశలకు పోతూ వుంటుంది. దీనిని నిరోధించాలని అనేది గూడ ఆలోచనయే. కాబట్టి ఆలోచనయే నిరోధకము. వేరే నిరోధక మంటూ లేదు. దీనిని సరిగా అర్థం చేసికోకపోతే, యీ వాక్యము – మిమ్ము అదుపులో వుంచే నిరోధకుడు ఎవరూ లేరనే వాక్యము – చాల ప్రమాదకరమైనది. ఈ వక్త తన భావావేశములను, ఆలోచనలను ఎప్పుడును నిరోధించలేదు, వశం చేసికోవాలని చూడలేదు. ఎందువల్లనంటే, మొదటినుండి నిరోధక నిరుద్ధములు రెండును ఒకటేయని గమనించినాడు. విభేదమున్నప్పుడే గదా ఘర్షణ వుంటుంది?

ధ్యానమనేది ఘర్షణ కాదు. మీరు నిరోధించి వశము చేసికోవలసినది కాదు, మీరు కొలవవలసినది కాదు, "ఇది చేయవలెను, అది చేయరాదు" అని అనడం లేదు. మీ ఖుంటెసి మీరు సక్రమంగా వుంచుకొంటే, చక్కదిద్దుకొంటే, ధ్యానము సహజంగానే

సిద్ధిస్తుంది. అంటే, మీలో ఘర్షణలేనప్పుడు, దాని నీడగూడ లేనప్పుడు ధ్యానము సహజంగా సిద్ధిస్తుంది. ఇది మానవుని మనస్సునకు చాల పెద్ద సవాలు. కాబట్టి ధ్యానమంటే కొలవడము పూర్తిగా ఆగిపోవడం. 'నేను' అనే భావన వున్నంతవరకు కొలవడముంటుంది. నాకున్న ఊహాప్రతిమలతో, నాకు తగిలిన గాయములతో, నాకున్న గర్వముతో, నాకున్న పేరాశతో, భయముతో, ఇంకా ఇటువంటి వానితో 'నేను' అనేది ఉన్నంత వరకు కొలవడ ముంటుంది. 'నేను' అనే భావన ఆలోచనచే కల్పింపబడినది. 'నేను' అనేది కొలవడానికి కేంద్రబిందువు, ఘర్షణకు కేంద్రస్థానము – అది ఉన్నంతవరకు ధ్యానము వలన ఇంకను ఎక్కువ భ్రాంతి, ఎక్కువ ఉపద్రవము కలుగుతుంటుంది. అట్టి ధ్యానమున కర్థమే లేదు. అది వ్యర్థము. కాబట్టి 'నేను' అనే భావన అంతమవడమే వివేకమునకును ధ్యానమునకును ఆరంభము.

మన మెప్పుడూ మనశ్శాంతిని కోరుకొంటూ వుంటామని మీకు తెలుసు. మనకు మనశ్శాంతి లేదు. పూర్తిగా హింసాప్రవృత్తి లేనప్పుడే శాంతి ఉంటుంది. మీకు ఆశలున్నంత కాలము హింసాప్రవృత్తి ఉంటుంది. ఇవన్నీ వాస్తవికాలు. వీటిని పరిశీలించండి. మీరేదైనా వర్గమునకు చెంది యున్నంతవరకు – అది మతవాదుల వర్గము గాని, జాతీయవాదుల వర్గముగాని, మరియొకరిది గాని – దేనికి చెందియున్నా హింసాప్రవృత్తి వుంటుంది. మీ కితరులతో గల సంబంధములో హింసాప్రవృత్తి వుంటుంది. కాబట్టి ధ్యానమును గూర్చిన పరిశీలన చాల ముఖ్యవిషయంగా ఎంచుకొని, అందుకోసమై తన్ను తాను సమర్పించుకొనే వ్యక్తికి తన యింటిని తాను చక్కదిద్దుకోవడం, దానిని సక్రమంగా ఉంచుకోవడం ప్రథమ బాధ్యత. అంటే, దాని అర్థం, అతని శరీరం ఆరోగ్యంగా వుండాలి. శరీరము యొక్క ప్రభావము మనస్సుమీద పడుతుంది. మీ శరీరము బరువై, అశిక్షితమైయున్నచో మీ మనస్సు గూడ మొద్దుబారి చురుకుగా పని చేయదు. ఇవన్నీ సాధారణ విషయాలు.

అయ్యలారా, మీకన్నీ సమస్యలే! ఇంటివద్ద కుటుంబంతో సమస్య, మీరు పనిచేసే కార్యాలయంలో సమస్య; ఎవరికి వోటు వెయ్యాలి. ఎవరికి వేయరాదు అనేదొక సమస్య – ఇంకా ఇట్లాంటివే ఎన్నో సమస్యలు. సమస్య అంటే పరిష్కారముగాని విషయము. మనలో చాలమందికి తగిలినట్లే, మీకుగూడ, మీ చిన్నతనంలో మనస్సునకు గాయము తగిలివుంటే, ఆ గాయంతో మనము మన శేషజీవితమంతా బాధపడుతూ గడుపుతాము. అది మనకొక బ్రహ్మాండమైన సమస్యగా తయారవుతుంది. ఎందువల్లనంటే, ఆ గాయంతోబాటు భయము, ఒంటరిపాటు, తప్పించుకు తిరగడం, వెనుదీయడం, పదిమందితో కలిసి తిరగడానికి జంకడం, ఇంకా భయమెక్కువవుతూ వుండడం – ఇవన్నీ వుంటాయి. అదియొక సమస్య. గాయము తగిలినది దేనికి? మీ గురించి మీరు నిర్మించుకొన్న ఊహాప్రతిమకు (Image) గాయము తగిలినది. మీరు నిర్మించుకొన్న ఊహాప్రతిమ – మంచిదిగాని, చెడ్డదిగాని – అది ఉన్నంతవరకు మీకు గాయము తగులుతూనే వుంటుంది. మీరు మీ గురించిగాని మరియొకరి గురించిగాని ఊహాప్రతిమను నిర్మించుకోవడం యథార్థం. ఆ ప్రతిమ వలన మీకు భద్రత వున్నట్లు, మీ ఉనికికి భయము లేనట్లు తలుస్తారు. అంటే, ఆలోచన చేత కల్పింపబడిన ఊహాప్రతిమలో మీరు మీ భద్రతను చూచుకొంటున్నారు. అంటే, ఆ

ప్రతిమలో నిజంగా భద్రత లేదన్న మాట; అయినా, దానిలో మీరు మీ భద్రతను వెదుక్కొంటున్నారు. ఇప్పుడు మీరీ వాక్యమును వింటారు, ఆ ప్రతిమ అవినీతి రూపమని చూచి గ్రహిస్తారు; అంతటితో ఆ ప్రతిమ అంతమై పోతుంది. అది పరాప్రజ్ఞయొక్క చేష్ట (తెలివి తెచ్చిన మార్పు). ఆరోగ్యవంతమైన మనస్సు గల ప్రాజ్ఞుడు, విషమును చూడగానే, అది ప్రమాదమని గమనించగానే, – వెంటనే – దానిని పరిహరిస్తాడు.

కాబట్టి ప్రశ్న యేమంటే, నిజమైన మతమన నేమి? ఈ జీవితమునకు సంబంధించినదై, త్రికాలా బాధితమై, అన్ని విధములైన కొలమానములకు (ప్రమాణములకు) అందనిదైన నిత్యసత్యమును, అమృతత్వమును, అప్రమేయమైనదానిని, నామరూప రహితమైన దానిని మానవు డెల్లప్పుడు అన్వేషిస్తూ వచ్చినాడు. "నేను మిమ్ము అక్కడికి తీసికొనిపోతా" నన్నవారు కొందరున్నారు. కాని, వారికి తెలియదని మనకు తెలుసు. మతగురువు తనకది తెలుసునని, సాధారణ జనులకది తెలియదని చెప్పి పెత్తనం తనమీద వేసికొన్న పురాతన కాలమునుండియు ఇది యిట్లే జరుగుతున్నది. మత గురువుల పీఠమేర్పడిన ప్రాచీన కాలంలో ఈజిప్టు దేశీయుడిట్లే చేసినాడు. మనమున్ను ఇప్పుడదేపని చేస్తున్నాము. నామ రహితము, రూప రహితము, వాగతీతమైన దానిని, విశ్వమని పిలువబడుదానిని మనము పొందగోరుతాము. ఇంతలో ఒకడు వచ్చి, "నేను నిన్నక్కడికి తీసికొనిపోతాను, నీవు స్వయంగా పోలేవని నాకు తెలుసు"నని అంటాడు! కాబట్టి, నాకు తెలుసుననే వాని యెడల మనం చాల జాగ్రత్తగా వుండాలి.

పవిత్రమైనది, ఉపేక్షింపరానిది ఏదో ఉన్నదని మానవుడన్న విషయం మనం తెలిసికొన్నాము. ఇక్కడ మానవుడంటే మూఢ విశ్వాసము గలవాడు కాదు. మూఢ విశ్వాసము గలవాడు చేతితోగాని, మనస్సుతోగాని నిర్మింపబడిన ప్రతిమను ఆరాధిస్తాడు. మూఢ విశ్వాసము గలవాడు కొన్ని మత విధులను ఆచరిస్తాడు, మత సంబంధమైన పిడివాదముల నంగీకరిస్తాడు, వ్యవస్థీకరింపబడిన గురుపీఠమును అనుసరిస్తాడు. ఇట్టివే మరికొన్నిటిని పాటిస్తాడు. వాటి నన్నిటిని ప్రక్కకు త్రోసివేస్తే, అప్పుడు అంతరికంగా విముక్తి – పరిపూర్ణ స్వాతంత్ర్యము – లభిస్తుంది. అంటే, అప్పుడు ఎటువంటి మానసిక సమస్యలుండవు. దానివలన బ్రహ్మాండమైన మానసిక శక్తి విడుదల అవుతుంది. నేను చెప్పేది మీకు అర్థమవుతున్నదా? మన శరీరమందున్న శక్తి ప్రతి దినము మీరు ఆఫీసుకు పోయేటప్పుడు కనబడుతుంది. వంతెన కట్టడానికి గాని, శారీరకంగా మరేపని చేయడానికైనా మీలో బ్రహ్మాండమైన శక్తి వున్నది. కాని మానసికంగా మనం అవిటివాండ్లం. మన మీవిషయమై ఎన్నడును విచారించనే లేదు, కారణమును ప్రశ్నించనే లేదు, పరిస్థితిని పరిశీలించనే లేదు. సమస్త సమస్యలనుండి విముక్తి లభించనిదే మన ప్రత్యగాత్మకు (the structure of the psyche) కి, మన మనస్సునకు పూర్ణ విముక్తి లేదు. నిశ్శబ్దమే ఆ శక్తి. మనస్సులోని విషయమంతా ఖాళీయవడమే, శూన్యమవడమే ఆ నిశ్శబ్దము. ఇది యెట్లా సంభవిస్తుందనే ప్రశ్నే లేదు. దీనికొక పద్ధతంటూ లేదు, పద్ధతులు, విధానములు అన్నీ ఆలోచనచే కల్పితములు. కావున అవన్నీ పరిమితములు, సావధికములు. అందువలన అవి ఉపయోగము లేదు. మీ కిది అర్థమైతే, ఏ పద్ధతిగూడ మనస్సును విముక్తముచేయలేదన్న సత్యాన్ని మీరు చూచినట్లయితే వెంటనే విముక్తియని మీరు గ్రహిస్తారు. నిజమైన మతదక్త

మేదనగా, అతి పవిత్రమై నామరహితమై, సర్వమునకు మూలమైన అఖండ సత్యమును బహిర్గతము చేయడము, దానిని మూసియున్న తెరను తొలగించడము. ఇక ధార్మికమగు మనస్సును గూర్చి విచారణ సల్పుదము. దానియొక్క నిజమైన అర్థంలో విముక్తమైన మనస్సే ధార్మికమగు మనస్సు. ధార్మికమగు మనస్సునకు సమస్యలుండవు.

ప్రేమ అనగానేమో అదిగూడ మనము విచారణ చేయవలసి యున్నది. ప్రేమ అనగా ఇంద్రియ సుఖము కాదు, ప్రేమ అనగా కోరిక కాదు, ఇంకా లోతుకుపోయి పరిశీలించండి. అందలి సత్యమును దర్శించినప్పుడు అందెంతో సౌందర్యముంటుంది. అసూయ, పరాధీనత, మమకారము మున్నగువానిచేత ఎన్నడును బొత్తిగా స్పృశింపబడని ప్రేమ ఎచ్చటనైతే వుంటుందో అచ్చట కరుణ, పరాప్రజ్ఞ ఉంటాయి. ఈ మూడును – ప్రేమ, కరుణ, పరాప్రజ్ఞ – అభిన్నములు. అప్పుడు మనస్సు అన్ని కాలమానములను అతిక్రమించి పోగలదు. ఆలోచన ద్వారా, కాలమానం ద్వారా, టెలిస్కోపు ద్వారా, నక్షత్రములను నిరంతరము పరిశీలించడం ద్వారా – ఇంకను ఇటువంటివాని సహాయమున విజ్ఞాన శాస్త్రవేత్తలు విశ్వమును పరిశోధిస్తున్నారు, ఖగోళ శాస్త్రవేత్తలు అంతరిక్షమును పరిశోధిస్తున్నారు. వారీ విశ్వమున కంతకును మూలకారణ మేమిటో తెలిసికొనడానికై ప్రయత్నిస్తున్నారు. అంటే, బాహ్యమందున్న విశాలాకాశములోనికి వారు పోతున్నారు. కాని, మానవుడు తన అంతస్సులోనికి పోయి పరిశోధించడం చాల అరుదు. అచ్చట నతడు కాలమానమున కందని బ్రహ్మాండమైన విశ్వమును – బాహ్య విశ్వమునకు ప్రతిరూపమైన దానిని – కనుగొనగలడు. అది చూడవలెనంటే మీ మనస్సులో విశాలమైన ఆకాశముండాలి. అదే ధ్యానము. మొదట ఇంటిని సక్రమమైన తీరున ఉంచుకోవాలి; సంపూర్ణమైన వ్యవస్థ (order) వుండాలి, క్రమబద్ధత వుండాలి. అది ఉన్నచో ఘర్షణగాని కాలమానముగాని ఉండవు. అట్టి యింటిలో ప్రేమ ఉంటుంది. అప్పుడు మనోద్రవ్యము (the content of the mind) అంటే చేతన, అంటే 'నేను' అనే భావన పూర్తిగా తొలగిపోతుంది. అంతవరకు మీరు వెళ్ళగలిగితే అప్పు డక్కడ అస్తిత్వమే (Being) గాని, పరిణామము (Becoming) ఉండదు. పరిణాము మనేది యింకను కాలమానమే. అప్పుడు మనస్సు సంపూర్ణముగ శాంతిస్తుంది. ఆ శాంతి ఏదో కొంతసేపుండేది కాదు. అప్పటి మనస్సు యొక్క సహజస్థితి శాంతి. ఆ శాంతి నుండి మీరు ఆలోచనకు ప్రతిస్పందించవచ్చు, ఆ యాలోచనను ఉపయోగించుకొనవచ్చు. అప్పుడు చేతనా ద్రవ్యమున్నను మనస్సు శూన్యమై, నిత్యశాంతితో విరాజిల్లును.

అంతవరకు మీరు వెళ్ళ గల్గినచో అప్పుడు మీకు తెలిసికోవలసినదేదో తెలియగలదు. అది నామరహితమైనది, శాశ్వతమైనది.

కొలంబో,
*16–11–1980.*

★ ★ ★

